ప్రచురణ :
1982, అక్టోబరు

ప్రతులకు :
సాహిత్య నికేతన్
3-4-852, బరకత్‌పుర
హైదరాబాద్ - 500 027

ముద్రణ :
భారత ముద్రణాలయం
నారాయణగూడ
హైదరాబాద్ - 500 029

వెల : [redacted]

# ఈ పుస్తకం గురించి

నేడు మన దేశంలో యువత సినాదాల మూలంగా, గోడలపై రాసిన పిచ్చి రాతల మూలంగా దగా పడుతున్నారు. నినాదాలన్నీ నిత్యసత్యం కావనీ, గోడలపై రాతలు ఆచరణలో నీటిపై రాతలనీ, ఆగోడలు కూలుతున్నాయనీ చెప్పవలసిన బాధ్యత మనపై ఉంది.

అడిగినవెంటనే ఈపుస్తకాన్ని ప్రచురణకు మాకు అందజేసిన రచయితలు శ్రీయుతులు నరసింహారెడ్డి, కృష్ణారావు గారలకు మా కృతజ్ఞతలు. భారత ముద్రణాలయాధిపతులకు అభినందనలు.

—ప్రకాశకులు

# నక్సలైట్లు ఏ దేశభక్తులు?

ఫిబ్రవరి 1848లో కారల్ మార్క్స్ చారిత్రాత్మక "కమ్యూనిస్టు మానిఫెస్టో"ను ప్రకటించిన తరువాత దాదాపు 70 సంవత్సరాలకు గాని కమ్యూనిస్టు రాజ్యం స్థాపించబడలేదు. ప్రణాళికా సృష్టికర్త అయిన మార్క్స్ ఊహించినదానికి భిన్నంగా భూస్వామ్య వ్యవస్థ నిరంకుశ పాలనలో క్రుమ్మగ్గుతున్న రష్యా కమ్యూనిస్టు ఆధిపత్యం క్రిందికి రావటం ఆశ్చర్యకరమే. ఆయన చెప్పిన కారణాలకంటే నాటి రాజకీయ పరిస్థితులు, చారిత్రక శక్తులవల్ల లెనిన్ నాయకత్వంలో మొట్టమొదటి కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడింది. మొదటి ప్రపంచ యుద్ధమే జరగకుంటే, జరిగినా సోవియట్ రష్యా ప్రధానపాత్ర వహించనట్లయితే 1904 లో జపాన్‌తో జరిగిన యుద్ధంలో రష్యా పరాజయం పొందినట్లయితే శక్తి క్షీణించిన సామ్రాజ్యాన్ని జార్ ప్రభువులకు సంక్రమించినట్లయితే రష్యా చరిత్ర మరియు కమ్యూనిష్టు పురోగతి మరొక విధంగా ఉండేవి. కమ్యూనిస్టు విప్లవం కేవలం పారిశ్రామిక సమాజంలోనే శ్రామికవర్గం ద్వారా విజయం సాధిస్తుందని, మార్క్స్ భావించినట్లు జరగలేదు. మొదటి కమ్యూనిస్టు రాజ్యం ఏర్పడటానికి నిరాశా నిస్పృహలతో ఉన్న రష్యన్ సామ్రాజ్య సైన్యాలను శైశవదశలో ఉన్న ఆనాటి బోల్షివిక్‌లు (కమ్యూనిస్టులు) తెలివిగా ఉపయోగించుకొని జార్ ఆధిపత్యాన్ని కూలద్రోసి కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని ఏర్పరచారు.

కమ్యూనిస్టు ఆశయాలకు భిన్నంగా జాతీయ భావాన్ని రెచ్చగొట్టి "పితృరాజ్యభవిష్యత్ ప్రమాదంలో ఉంద"న్న నినాదాన్నిచ్చి సోవియట్ పతిష్ఠతకు ఎటువంటి త్యాగానికయినా సిద్ధంగా ఉండాలని ప్రబోధిస్తూ, నూతన శకాన్ని ఆరంభించారు. నాటి రష్యన్ ప్రజలు ప్రధాన సమస్య లుగా భావిస్తున్న నిరంకుశ జార్ పాలన అరాచక వాతావరణం నిర్మూ లించటానికి బోల్షివిక్‌లే శరణమని భావించి నూతన ప్రభుత్వాన్ని ఆహ్వా నించారేకాని మార్క్స్ సిద్ధాంతాలవల్ల ప్రబోధితులయి సామ్యవాద సమ సమాజ స్థాపనకోసం కలలుకని మాత్రంకాదు. అటువంటి పరిస్థితులలో సమ్మోహన శక్తిగల ఏ నాయకుడయినా వీటిని ఆసరాగా తీసుకుని ముందుకు వచ్చినట్లయితే విజయాన్ని సాధించి ఉండేవాడు. ఆ లక్షణాలు కలిగిన వ్యక్తి లెనిన్ అవడంవల్ల బోల్షివిక్ విప్లవం ఫలించి కమ్యూనిస్టులు అధికారంలోకి రాగలిగారు.

## రష్యా ప్రాముఖ్యం

సోవియట్ రష్యాను కమ్యూనిస్టు రాజ్యంకాక ఒక దేశంగా కూడా పరిగణించినా దానికిఉన్న ప్రాముఖ్యం ఏమాత్రం తగ్గదు. ప్రపంచంలో అన్నిటికంటే పెద్ద దేశంగా (భారత దేశానికి ఏడురెట్లు) అపారమైన ఖనిజసంపద ప్రకృతి సిద్ధంగా సంక్రమించిన వ్యావసాయిక భూములు దానికితోడు జనాభా మూడవ పెద్దదేశంను కలిగి ఉండటం సహజంగానే సోవియట్ జాతీయ శక్తిని ఇనుమడింపజేశాయి.

బోల్షివిక్ విజయాలను సుస్థిరం చేసుకోటానికి మార్క్స్ చెప్పిన సిద్ధాంతాలకు ప్రాధాన్యమివ్వకుండా లెనిన్ తన స్వంత ఆలోచనతో నూతన ఆర్థిక విధానాన్ని రూపొందించి తద్వారా కమ్యూనిస్టు రాజ్యానికి గట్టిపునాదులు వేశాడు. ఉత్పత్తిసాధనాలను జాతీయం చేసినా వ్యావ

సాయిక భూముల విషయంలో కొన్ని జాగ్రత్తలు లెనిన్ వహించడం గమనించదగినది. ఫ్యూడల్ వ్యవస్థను నిర్మూలించి చిన్నతరహా రైతాంగాన్ని ప్రోత్సహించి కొన్ని భూసంస్కరణలనే చేపట్టాడుకాని నేటి రష్యా అవలంబిస్తున్న సమష్టి వ్యవసాయ క్షేత్రాలను సమర్థించలేదు.

లెనిన్ వారసుడైన స్టాలిన్ వ్యవసాయ రంగంలో లెనిన్ అవలంబించిన విధానానికి స్వస్తిచెప్పి వ్యవసాయ భూములను జాతీయంచేసి ప్రభుత్వ యాజమాన్యంలో సమష్టి వ్యవసాయక్షేత్ర విధానాన్ని ప్రవేశపెట్టాడు. దానిఫలితమే నేటికీ సోవియట్‌రష్యా ఎదుర్కొంటున్న ఆహార కొరత. రష్యా ఇప్పటికే కెనడా, అర్జెంటీనా, అమెరికా, ఆస్ట్రేలియా నుంచి గోధుమను దిగుమతి చేసుకొంటున్నది.

పారిశ్రామికీకరణద్వారా తనకున్నటువంటి అపారమైన సహజ వనరులతో ఒక శక్తివంతమైన పారిశ్రామిక దేశంగా రష్యా బలపడుతూ వచ్చింది. స్టాలిన్ నాయకత్వంలో మార్క్సును ఆదర్శంగా పెట్టుకొని జారు ప్రభువులద్వారా సంక్రమించిన సువిశాల సామ్రాజ్యాన్ని రష్యా విస్తరింపజేయ గలిగింది. బాల్టిక్ రిపబ్లిక్‌లైన ఎస్తోనియా, లాటినియా, లిథోనియాలను విలీనం చేసుకొంది. జారుప్రభువుల విధానాలకు స్టాలిన్ విధానాలకు ఉన్న ఒక్క వ్యత్యాసం ఉత్పత్తి సాధనాలను జాతీయం చేయడంలోనే కన్పిస్తుంది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని తాత్కాలికంగా వాయిదావేసి పితృదేశం సామ్యవాదశక్తిగా బలపడాలన్న ఆకాంక్షతో రష్యా ఆసక్తులమీద ఏకాగ్రత చూపిన స్టాలిన్ అప్పటికే మావో నాయకత్వంలో చైనాలో బలం పుంజుకొంటున్న ప్రజాయుధ ఉద్యమానికి పెదవి సానుభూతి చూపాడు కాని చెప్పుకోదగ్గ సహాయం చేయలేదు. నిజానికి చైనా రష్యాల మధ్య ఏర్పడిన అభిప్రాయ భేదాలు ఆనాడే ఈసందర్భంలోనే ప్రారంభమైనాయని చెప్పవచ్చు.

# రెండవ కమ్యూనిస్టు శక్తిగా చైనా అవతరణ

రెండవ శక్తివంతమైన కమ్యూనిస్టు దేశంగా పరిగణింపబడుతున్న చైనాలో కూడా కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడటానికి వాటి కమ్యూనిస్టు అధినేత అయిన మావో చైనా జాతీయవాదాన్ని ఆదర్శంగా తీసుకొని, అప్పటికే అవమానభారంతో క్రుంగిపోతున్న చైనాను పునరుద్ధరిస్తానన్న వాగ్దానంతో ప్రజాపోరాటాన్ని నిర్వహించి కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని 1949లో స్థాపించాడు. మార్క్స్ చెప్పిన పారిశ్రామిక కమ్యూనిజాన్ని సమూలంగామార్చి, చైనాకు అనుసరించేవిధంగా రైతాంగ కమ్యూనిజాన్ని మావో ప్రతిపాదించాడు. ఈ అనుకరణలు, మార్పులే చివరికి సైద్ధాంతిక చీలికలకు దారితీశాయి.

తూర్పు యూరప్‌లో కమ్యూనిజమ్: రెండవ ప్రపంచ యుద్ధంలో ప్రధాన పాత్ర వహించిన సోవియట్ రష్యా హిట్లర్ పతనానంతరం తన ప్రాబల్యాన్ని విస్తరింపజేసుకోటానికి అంతర్జాతీయ కమ్యూనిజం పేరుతో తూర్పు యూరోప్ రాజ్యాలైన పోలాండ్, హంగేరి, తూర్పుజర్మనీ రుమేనియా, బల్గేరియా, అల్బేనియాలో ఎర్ర సైన్యంద్వారా కమ్యూనిస్టు ప్రభుత్వాలను ఏర్పరచింది. యుద్ధానికి పూర్వం ఈరాజ్యాలలో కమ్యూనిస్టేతర శక్తులకే ఆధిక్యత ఉండేది. అక్కడి కమ్యూనిస్టు పార్టీలు చాలాబలహీనంగా ఉండటమేకాక స్థానిక ప్రజలలో కమ్యూనిస్టులంటే విదేశీయ ఏజంట్లు అనే భావం ప్రబలిఉండినది.

తూర్పు యూరోప్‌లో ఈ కమ్యూనిస్టు ప్రభుత్వాలు రష్యా సైనిక శక్తిపై ఆధారపడినవేకానీ స్వయంశక్తితో జాతీయవాద బలంతో ప్రజా -కణను పొందినవికావు. ప్రస్తుతం ఈ దేశాలలో ఉన్న పరిస్థితులను రిశీలిస్తే(పోలాండ్, హంగేరీ, చకొస్లోవేకియా సంఘటనలు)రష్యాజాతీయ

ప్రయోజనాలకోసం అంతర్జాతీయ కమ్యూనిజం పేరిట కమ్యూనిజం వీటిపై బలవంతంగా రుద్దబడినట్లు కనిపిస్తుంది. వీటి ప్రభుత్వం ఈ రాజ్యాలను రష్యా ఉపగ్రహాలుగా తయారుచేశాయి.

## అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం

సాయుధ పోరాటం లేకుండా ఏ దేశాలలోనూ కమ్యూనిస్టు వ్యవస్థ ఏర్పడలేదు. ఏసాయుధపోరాటం కూడా విదేశీసహాయం లేకుండా (చైనా, యుగొస్లావియా క్యూబాలను మినహాయించి) నిరవధికంగా కొనసాగలేదు ఆగ్నేయ ఆసియా దేశాలయిన వియత్నాం, కంపూచియా, మరియు లావోస్‌లో జరిగిన కమ్యూనిస్టు సాయుధ పోరాటాలు మనకు ఈవిషయాన్ని స్పష్టం చేస్తాయి. ఉత్తర కొరియాలో రష్యా, చైనా ప్రత్యక్ష జోక్యం వల్లనే కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడింది. చకోస్లోవాకియాలో కూడా మొదట రష్యాజోక్యం లేనప్పటికీ ఐక్యసంఘటన పేరుతో అధికారాన్ని హస్తగతం చేసుకొన్న కమ్యూనిస్టు పార్టీ ఆ తరువాత రష్యా సహాయాన్ని అర్థించింది.

మూడవ ప్రపంచ దేశాలలో ముఖ్యంగా ఆఫ్రికా రాజ్యాలలో పరోక్ష సైనిక చర్యద్వారా కమ్యూనిస్టు ప్రభుత్వాలను స్థాపించడం జరిగింది. అంగోలాలో రష్యా ప్రోత్సాహంతో క్యూబా సైనిక సహాయంతో కమ్యూనిస్టు ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. స్థానిక జాతీయవాదులు జాతివిమోచనానికయి ఎవరితోనయినా చేతులు కలువటానికి వెనుకాడని సమయంలో పైజోక్యం సాధ్యమయింది. ఇదేపద్ధతిలో మొజాంబిక్, ఇతియోపియాలో కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చారు.

## కమ్యూనిజం వ్యాప్తికి అనుసరించే పద్ధతులు

కమ్యూనిస్టు ప్రభావ వ్యాప్తికి అనుసరించే పద్ధతులు 1) ప్రత్యక్ష సైనిక జోక్యం (అఫ్ఘనిస్తాన్, తూర్పు యూరప్ దేశాలు, ఉత్తరకొరియా

మరియు మంగోలియా) 2)జాతీయవాదాన్ని సాధనంగా ఉపయోగించుకొని పరోక్ష సహాయం ద్వారా (రష్యా లేదా చైనా) 3)మరొ కమ్యూనిస్టు రాజ్యం ప్రత్యక్ష సైనిక జోక్యం ద్వారా (అంగోలా, మొజాంబిక్, ఇతియోపియాలో క్యూబా జోక్యం) 4)సమ్మోహనశక్తిగల నాయకుని ద్వారా జాతీయవాదాన్ని ఉపయోగించుకోవటం (చైనాలో మావో, వియత్నాంలో హోచిమిన్, యుగోస్లోవియాలో టిటో) 5)ప్రజాస్వామ్య ఎన్నికల ద్వారా (భారతదేశంలో కొన్నిరాష్ట్రాలలో, ఇటలీలో ఫ్రాన్స్‌లో చిలీలో అధికారాన్ని సంపాదించటం) ఇటలీ, ఫ్రాన్స్‌లలో కమ్యూనిస్టు పార్టీ సంకీర్ణ ప్రభుత్వాలలో భాగస్వామి. చిలీలో సైనికతిరుగుబాటు ద్వారా అయిలండీ కమ్యూనిస్టు ప్రభుత్వం పతనమయింది 6)ఎవరిజోక్యమూలేకుండాస్థానిక తిరుగుబాటుద్వారా కైవసం చేసుకొని అటు తర్వాత కమ్యూనిజాన్ని ఆశ్రయించిన ప్రభుత్వము (క్యూబా, గినీ, ఓనిక్ దేశాలు) .

## కమ్యూనిస్టు వ్యవస్థప్రాముఖ్యత

1917 నుండి నేటివరకూ జరిగిన కమ్యూనిస్టుఉద్యమాల ఫలితంగా 17దేశాలలో కమ్యూనిస్టు వ్యవస్థలు ఏర్పడ్డాయి. ప్రపంచ జనాభాలో దాదాపు 150 కోట్లు ప్రజలు (మూడవభాగం) కమ్యూనిస్టుపాలనలో జీవిస్తున్నారు. భౌగోళికంగా చూసినట్లయితే 1/5 వంతు భూభాగం కమ్యూనిస్టుల ఆధీనంలో ఉంది. సాంకేతికంగా, సైనికంగా కమ్యూనిస్టు రాజ్యాలు ఒక బలమయిన శక్తిగా ఏర్పడ్డాయి. యూరప్ సహజవనరులు మరియు ఖనిజ సంపదలో కూడా వాటిది మూడవస్థానం కమ్యూనిస్టు రాజ్యాల ప్రాబల్యంవల్లనే అంతర్జాతీయ వ్యవసాయరంగంలో అనేక మార్పులు ఏర్పడ్డాయి.

కమ్యూనిజం వల్ల సామ్రాజ్య వ్యతిరేక పోరాటాలు ఆందోళనలు ఉధృతమయినాయి. వాటిని కమ్యూనిస్టులు తమ లక్ష్యసాధనకయి విని యోగించుకుంటున్నారు. దీని ఫలితంగా మూడవ ప్రపంచ దేశాలలోబయ లుదేరిన జాతీయోద్యమాలు బలపడటమేకాక సాయుధపోరాటాలకు కూడా కారణమయినాయి. ఈ సాయుధ పోరాటాల వల్ల కలిగిన ప్రయోజనాలు, జాతీయవాదులకే పరిమితం కాక స్థానిక కమ్యూనిస్టుశక్తులు కూడా బలపడ్డాయి. ఇవన్నీ సామ్రాజ్యవాద పతనానికి వలస విధానం క్షీణ తకు మార్గమయినయి. 1945-80 మధ్యకాలంలో దాదాపు 100 దేశాలు స్వాతంత్ర్యాన్ని పొందాయి. తత్ఫలితంగా ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వం 51 నుండి 150కు పెరిగింది.

పెట్టుబడిదారీ వ్యవస్థను నిర్మూలించడంలో కొంతవరకు కమ్యూ నిస్టులు విజయం సాధించారని చెప్పవచ్చు. వారి ప్రభావం వల్లనే అమెరికా ఇతర పరిశ్రమ దేశాలు స్థిరపడ్డ పెట్టుబడిదారీ వ్యవస్థలో అనేక మార్పులు వచ్చాయి. మానవతావాద పెట్టుబడిధారీవిధానం పేరుతో అనేక ప్రజోప కరమైన సంస్కరణలను ఆయా ప్రభుత్వాలు చేపట్టాయి. అంతరించి పోతుందనుకొన్న పెట్టుబడిదారీ వ్యవస్థ ఈ మార్పులవల్ల మరింత ఆకర్షణీ యంగా తయారయింది. "స్వేచ్ఛ మరియు ఆహారం" అనే నినాదంతో ప్రజాస్వామ్యం ఈ రాజ్యాలలో పటిష్ఠమైంది.

వెనుకబడిన దేశాలలో సామ్యవాదం ప్రజాదరణ పొంది పెట్టుబడి దారీవిధానానికి ప్రత్యామ్నాయంగా ప్రాచుర్యం పొందింది.కమ్యూనిస్టు పెట్టు బడిదారీ దేశాల మధ్య పోరాటాలలో మూడు ప్రపంచ రాజ్యాలు అలీనవిధా నాన్ని అవలంబించి ఆర్థికంగా సాంకేతికంగా లాభాన్ని పొందుతున్నాయి. వనరులు లేని చిన్నదేశాలు తమ స్వాతంత్ర్యాన్ని రక్షించుకోటానికి పై రాజ్యాల మధ్య పోటీ ఉపయోగపడింది.

# కమ్యూనిష్టు ఉద్యమ వైఫల్యాలు

స్వర్గీయ కృశ్చేవ్ 1960లో రాబోయే 20 సంవత్సరాలలో అమెరికా పశ్చిమ యూరోప్‌ను మినహాయించి ప్రపంచమంతా కమ్యూనిస్టు పరిధిలోకి రానున్నదని ఆత్మవిశ్వాసంతో ప్రకటించాడు. ఈ ప్రకటన జరిగిన ఇరవై రెండు సంవత్సరాల తరువాత కూడ కమ్యూనిజం ప్రపంచ వ్యాప్తం కాకపోగా అంతర్గతంగానే సమస్యలను ఎదుర్కొంటున్నది.

కమ్యూనిస్టు వ్యవస్థ ప్రభావం ఇప్పటికే తూర్పుయూరోప్, చైనా ఇండోచైనా రాజ్యాలకే పరిమితమై ఉంది. ఆసియా, ఆఫ్రికా, అమెరికా దేశములో చెప్పుకోదగ్గ ప్రగతిని సాధించలేదు. కమ్యూనిస్టు దేశంతోపాటు ఆ ప్రభుత్వముఉన్న దేశాలతో సహా వీటిసంఖ్య 20కి మించిలేదు.

కమ్యూనిస్టు వ్యవస్థలోనే రష్యా చైనాల మధ్య ప్రాబల్యంకోసం పోటీ అధికమయింది. ఈపోటీ చివరికి కమ్యూనిస్టు ఏకాధిపత్య వ్యవస్థలో బీటలను వేసి వర్గాలను సృష్టించింది. కమ్యూనిస్టేతర దేశంలోని ఉద్యమాలపై దీని ప్రభావం పడింది. అక్కడ చీలికలు వచ్చి ఉద్యమాలు కుంటుపడ్డాయి. కమ్యూనిస్టు వర్గాల మధ్యనే తీవ్రమైన సాయుధపోరాటాలు జరుగుతున్నాయి. కాంపూచియాలో ప్రస్తుత కమ్యూనిస్టు ప్రభుత్వానికి (సమరిన్) మరియు అజ్ఞాతవాసంలో ఉన్న మాజీ రాజ్యాధినేతయిన కె. సంపన్‌కు మధ్య సాయుధ సంఘర్షణలు జరుగుతున్నాయి. వీటి వల్ల దాదాపు 20 లక్షల ప్రజానీకం మరణించారని ఐక్యరాజ్యసమితి పరిశీలకులు చెబుతున్నారు. ఇదే విధంగా ఇటీవల చైనా వియత్నాంల మధ్య జరిగిన సరిహద్దుయుద్ధం మరొక ఉదాహరణ.

రష్యా చైనాల మధ్య ఏర్పరచుకొన్న స్నేహసంధి 1980లో రద్దయింది. ఆ తరువాత దానిని పునరుద్ధరించ లేదు. కాగా ఈ అగ్ర కమ్యూ

నిస్టు రాజ్యాల మధ్యఉన్న సరిహద్దు వివాదం మరింతఅగ్గాధాన్ని సృష్టించి కమ్యూనిస్టు ఏకాధిపత్య వ్యవస్థ పూర్తిగా బీటలు వారేటట్లుచేసాయి.

సిద్ధాంతరీత్యాకూడా రష్యా చైనాల మధ్య తీవ్రమైన విభేదాలు ఏర్పడ్డాయి. అంతర్జాతీయ వ్యవహారాలలో రష్యా రెండు ప్రపంచాల సిద్ధాంతాన్ని (కమ్యూనిస్ కమ్యూనిస్టేతర) బలపరచగా చైనా మూడు ప్రపంచాల సిద్ధాంతాన్ని (రెండు అగ్రరాజ్యాలు) అభివృద్ధి చెందిన పశ్చిమ రాజ్యాలు మరియు జపాన్ వెనుకబడిన దేశాలు లేవనెత్తింది. చైనా తనను వెనుకబడిన దేశంగా భావిస్తుంది. రష్యా చైనాను ఏకాకి చేయాలని ప్రయత్నిస్తుంటే చైనా రష్యాఆధిపత్యాన్ని అరికట్టడానికి ప్రయత్నిస్తున్నది. ఈ సందర్భంలో చైనా అమెరికాల మధ్య ఏర్పడిన సత్సంబంధాలను గమనించాలి.

పటిష్ఠమైన తూర్పు యూరపు కమ్యూనిస్టు వ్యవస్థలో ఉద్రిక్తతలు ఏర్పడుతున్నాయి. చారిత్రకంగా రష్యా ఆధిపత్యాన్ని అంగీకరించిన పోలండ్ చకోస్లోవేకియా హంగేరీలు కమ్యూనిజాన్ని స్వీకరించినప్పటికి రష్యా వ్యతిరేకభావం ఇక్కడి ప్రజలలో తగ్గలేదు. రష్యాస్వీయ ప్రయోజనాల దృష్ట్యా ఈ దేశాలపై తన ఆధిపత్యాన్ని వదులుకోడానికి ఇష్టపడదం లేదు. తరచుగా పై రాజ్యాలలో ఏర్పడే సంక్షోభాలను నివారించటానికి సైనిక చర్యను తీసుకోడానికి కూడా వెనుకాడటం లేదు. 1956లో హంగేరీలో రష్యా వ్యతిరేక ఆందోళన చెలరేగినప్పుడు సైనికచర్యద్వారా అణచివేసి కమ్యూనిస్టు నాయకుడయిన ఇమ్రీనాగిని అంత మొందించటం జరిగింది. 1968లో డుబెకి నాయకత్వంలో ఉన్న జెకోస్లోవాకియాలోని కమ్యూనిస్టు ప్రభుత్వం ఎదురు తిరిగినప్పుడు సైనికచర్యద్వారా అతనిని పదవినుంచి తొలగించి క్రొత్త ప్రభుత్వాన్ని రష్యా ఏర్పరిచింది. ప్రస్తుతం పోలండ్‌లో కొనసాగుతున్నసంక్షోభంలోకూడా రష్యా పరోక్షంగా సైనిక చర్యకు మద్దతునిచ్చింది.

## మార్క్సిజం అంటే ?

కమ్యూనిస్టు యుగపురుషుడుగా చరిత్ర ప్రసిద్ధి చెందిన కారల్ మార్క్స 1848 లో కమ్యూనిస్టు మానిఫెస్టోలో ప్రతిపాదించిన సిద్ధాంతాన్నే మార్క్సిజమ్‌కు మూలం అంటారు. మార్క్సిజమ్ మూల సూత్రాలు ఇవి: చారిత్రక భౌతికవాదం, మిగులు విలువ సిద్ధాంతము వర్గసంఘర్షణ, శ్రామిక నియంతృత్వ స్థాపన వర్గరహిత రాజ్య రహిత సమాజస్థాపన మరియు రాజ్యవ్యవస్థ క్రమక్రమంగా అంతరించడం.

మార్క్స అభిప్రాయంలో మానవచరిత్రలో ముఖ్యమైనఅంశం భౌతిక పరిస్థితులు. ప్రజల రాజకీయ, సాంఘిక, ఆర్థిక వనరులు నిర్ణయిస్తాయి. ఉత్పత్తిసాధనాలను నియంత్రణ చేసేవారు ఏ సమాజంలోనైనా ఆధిపత్య స్థానంలో ఉంటారు.

ఉత్పత్తి వనరులపై యాజమాన్యం ఏ సమాజంలోనైనా ముఖ్యంగా ఆధునిక పారిశ్రామిక సమాజంలో ప్రజలను ధనికులు, పేదలుగా పెట్టుబడిదారులు, శ్రామికులుగా రెండువర్గాలుగాసృష్టిస్తుంది. శ్రామికుడు తనకు లభించిన వేతనం కంటే అధిక విలువ గల వస్తూత్పత్తిని తన శారీరకశ్రమతో చేస్తాడు. అతని వేతనంకంటే ఎక్కువ విలువగల వస్తువుల మూల్యాన్ని అనగా అదనపువిలువను శ్రామికుడు పొందకుండా ఉత్పత్తి సాధనాల యజమాని తీసుకొంటాడు. దానిని శ్రామికుడు సృష్టించిన అదనపు విలువ (Surplus Value) అంటారు.

అదనపు విలువను దోచుకొనే పెట్టుబడిదారీ వర్గానికి నిరంతరం చాలీచాలని జీతంతో పొట్టకోసం కాయకష్టంచేసే శ్రామిక వర్గానికి మధ్య జరిగే సంఘర్షణే వర్గపోరాటము. నానాటికీ పెరిగే శ్రామికుల అసంతృప్తి సంఖ్య వారిని బలమైన వర్గంగా రూపొందించి నూతన చైతన్యంతో ఉత్తేజపరిచే పెట్టుబడిదారీ వర్గంతో సంఘర్షించటాన్ని అనివార్యం చేస్తాయి.

(తరువాయి ప్రక్క పేజీలో)

## మార్క్సిజం అంటే ?

ఈ చారిత్రక పోరాటంలో కార్మికవర్గం విజయం సాధిస్తుంది. కార్మికవర్గం పెట్టుబడిదారీ వ్యవస్థను కూలదోసిన తరువాత సమ సమాజ స్థాపనకు భూస్వామ్య పెట్టుబడిదారీ అవశేషాలను నిర్మూలించ టానికి శ్రామిక నియంతృత్వాన్ని స్థాపిస్తుంది. ఈ దశ తాత్కాలిక మైంది. సామ్యవాదానికి కమ్యూనిస్టు సమాజ స్థాపనకు మధ్య ఇది సంధికాలము.

శ్రామిక నియంతృత్వం ప్రైవేట్ ఆస్తిని వారసత్వ హక్కు లను రద్దుచేస్తుంది. ఉత్పత్తిసాధనాలను జాతీయంచేసి సమాజపరంగా ప్రభుత్వం నిర్వహిస్తుంది. ఈ సామ్యవాదదశలో ప్రతివ్యక్తికి అతని సామర్థ్యంబట్టి పని శ్రమకు తగిన ప్రతిఫలం లభిస్తాయి.

పెట్టుబడిదారీ వ్యవస్థకు మూలస్తంభమయిన ప్రైవేట్ ఆస్తిని రద్దుచేయడంతో వర్గాలు నశించి ప్రజలంతా ఒకేవర్గంగా శ్రామిక వర్గంగా ఏర్పడతారు. ఉత్పత్తి లక్ష్యాలు ప్రజల అవసరాలకు తగినట్లు నిర్ణయించబడతాయి. ప్రతివ్యక్తి శ్రమించి పనిచేసి తన అవసరాలకు తగిన ప్రతిఫలం పొందుతాడు. అందరూ ఒకేవర్గం అవటంతో వర్గ రహిత సమాజం ఏర్పడుతుంది.

మార్క్స్ అభిప్రాయంలో రాజ్యం వర్గప్రాబల్యానికి సాధనం. పెట్టుబడిదారీ సమాజంలో శ్రామికులను దోచుకోటానికి ఉపయోగపడు తుంది. శ్రామికవర్గ నియంతృత్వంలో సమసమాజ స్థాపనకు శ్రామి కుల ఆధిపత్యానికి వినియోగపడుతుంది. వర్గదోపిడికి సాధనమయిన రాజ్యం క్రమంగా వర్గాల నిర్మూలనతో అదృశ్యమవుతుంది.

---

వార్సా సైనిక కూటమిని తమజాతీయ ప్రయోజనాలకై సోవియట్ నాయకులు ఉపయోగించుకొంటున్నారు. రుమేనియా అల్బేనియా వంటి కమ్యూనిస్టు దేశాలు దాదాపు స్వతంత్ర పంథాను అనుసరిస్తున్నాయి. వాస్తవానికి స్వతంత్ర కమ్యూనిస్టు విధానానికి పునాది వేసింది యుగో స్లోవేకియా నాయకుడు స్వర్గీయ టిటో.

ఉపగ్రహ రాజ్యాలను అటుంచి రష్యాలోపలే ఆంతరంగిక ఉద్రిక్తతలు అధికమవుతున్నాయి. వీటివల్ల సోవియట్ వ్యవస్థకు ప్రమాదం లేనప్పటికి వాటి ప్రభావం కొంతవరకయినా వ్యవస్థపై కనిపిస్తుంది. రష్యాలో అసమ్మతివాదుల సమస్య నానాటికి పెరుగుతున్నది. అనేక అసంతృప్తివాదులను పార్టీనుండి తొలగించటమేకాక దేశ బహిష్కరణ చేయటంకూడ జరిగింది. సోల్‌విట్‌సిన్ బోరినోవ్, అలెనిజినా రోస్ట్రోకోపిచ్, లిటేవినోవ్ బుకో విస్కీ గింజ్‌వర్జీ మరియు స్వర్గీయ బోరిస్ పాగస్టర్‌నాక్ మొదలయిన మేధావులకు కూడా ఈగతి తప్పలేదు.

కమ్యూనిస్టు వ్యవస్థ లక్ష్య సాధనాలు కూడా సఫలం కాలేదు. తమ దేశాలలో పెట్టుబడిదారీ విధానం రద్దయిందని చెప్పుకొన్నప్పటికీ దాని స్థానంలో ప్రభుత్వ పెట్టుబడి వ్యవస్థను ఏర్పాటు చేసుకోవడంతో అనేక లోపాలు ఏర్పడ్డాయి. అధికార పరంపర, ప్రత్యేక హోదా కలిగిన ఉన్నత అధికారుల వర్గంమాత్రం నిర్మూలింపబడలేదు. దానివల్ల పాతవర్గాలస్థానంలో వర్గరహితసమాజంలో నూతన వర్గాలు ఏర్పడ్డాయి. ఇది కమ్యూనిజం సిద్ధాంతానికి మూల స్తంభమైన సమానత్వానికి గొడ్డలిపెట్టు.

సామాజిక వ్యవస్థలో కూడ "కామ్రేడ్" భావం నశించి వర్గ ఉద్రిక్తతలు ఏర్పడ్డాయి. పార్టీ పదవులలో ఉన్న వారందరికీ ప్రత్యేక హోదా సదుపాయాలు, లాభాలు అవకాశాలు కల్పించడం వల్ల వీరొక శక్తివంతమయిన ఆసక్తివర్గంగా ఏర్పడి ఉన్నవారు లేనివారు అనే తారతమ్యాన్ని సృష్టిస్తున్నారు. మార్క్స్ కలలు కన్నభూతం స్వర్గాన్ని సృష్టించిందని చెప్పుకొనే సోవియట్ యూనియన్‌లో ఏర్పడిన మార్పును 20 సంవత్సరాల క్రితమే యుగోస్లావేకియా కమ్యూనిస్టు నాయకుడయిన జిలాస్ బయట పెట్టడం జరిగింది! ఇది కమ్యూనిస్టు వ్యవస్థకు మరొక అపప్రథ. దీనిని నిరోధించలేకపోతే కమ్యూనిజానికి ఫాసిజానికి వ్యత్యాసం ఉండదని జిలాస్ విమర్శించాడు.

ఆర్థికాభివృద్ధి కమ్యూనిస్టు వ్యవస్థలో త్వరితంగా జరుగుతుందని గొప్పగా ప్రచారంచేసుకొన్నప్పటికీ వాస్తవాలు దీనికి విరుద్ధంగా ఉన్నాయి. పెట్టుబడిదారీ దేశాలతో పోలిస్తే తూర్పుకమ్యూనిస్టు రాజ్యాలు అభివృద్ధి అతి తక్కువ. పైగా ఈ రాజ్యాలు కమ్యూనిజాన్ని స్వీకరించిననాటికి పశ్చిమ రాజ్యాలవలె పారిశ్రామికీకరణ పొందినవే. నేటి తలసరి ఆదాయం అభివృద్ధి రేటును పరిశీలిస్తే ఈ దేశాలు పశ్చిమ జర్మనీ నెదర్లాండ్స్, ఫ్రాన్స్, స్కాండినేవియన్ రాజ్యాలు మరియు స్విట్జర్లాండ్ కంటె వెనుక బడిఉన్నాయి. ఇది కమ్యూనిస్టు వ్యవస్థ గుర్తించవలసిన కొన్ని బాధాకర మైన వాస్తవాలు.

సోవియట్ రష్యానే నమూనాగా తీసుకొన్నట్లయితే కమ్యూనిస్టు రాజ్యంలో ఆర్థికాభివృద్ధి త్వరితంగా జరుగుతుందని చెప్పవచ్చు. కాని రష్యాకు ఉన్న వనరులను గమనిస్తే అది సాధించిన ప్రగతిలో ప్రత్యేకత ఏమి కనబడలేదు.

చైనా అభివృద్ధిని గురించి ఖచ్చితమైన నిర్ధారణ చేయటం చాలా కష్టము. చైనా మూడవ ప్రపంచ రాజ్యాలలో తానొకటి అని స్వయంగా ప్రకటించుకొని, పేదదేశాలలో తానొక అంతర్భాగమని నిరూపించు కొన్నది. ముప్పైమూడు సంవత్సరాల కమ్యూనిస్టు పాలనలో ఉన్నచైనా లోనే ఇటువంటి పరిస్థితి ఏర్పడితే (ఆ నాయకులే అంటున్నారు) ఇక కమ్యూనిస్టు వ్యవస్థ ఆర్థిక అభివృద్ధి గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు.

ఇండోచైనా కమ్యూనిస్టు దేశాలయినా కంపూచియా లావోస్ వియత్నాంల ఆర్థిక పరిస్థితికి భారతదేశ పరిస్థితికి పెద్ద వ్యత్యాసం కాదు. ఐక్య రాజ్యసమితి ప్రకటించిన 31 అతి పేద దేశాలలో లావోస్ ఆఫ్ఘనిస్తాన్‌లు ఉన్నాయి. కాంపూచియా పరిస్థితి మరింతదారుణంగా ఉన్నది.

వాస్తవానికి కమ్యూనిస్టు సిద్ధాంతం అంతర్జాతీయ వాదాన్ని బల పరచి జాతీయ వాదానికి దూరంగా ఉంటుంది. కమ్యూనిస్టు వ్యవస్థ ఏర్ప డిన తొలిరోజులలో గూడా ఈ వాదానికే ప్రాముఖ్యం ఇవ్వబడింది. కానీ, జాతీయ శక్తుల ఒత్తిడికి తట్టుకోలేక కమ్యూనిజం జాతీయ వాదంతో రాజీపడి తద్వారా ప్రాబల్యం సాధించుకొని ప్రయత్నిస్తూ విఫలమయింది.

## నేటి విభజిత కమ్యూనిస్ట్ వ్యవస్థ

65 సంవత్సరాల అంతర్జాతీయ కమ్యూనిస్ట్ ఉద్యమం అనేక మార్పులకు చేర్పులకు లోనయి కాలక్రమంలో బహుపక్ష కమ్యూనిస్టు వ్యవస్థగా ఏర్పడింది, ఈబహుపక్ష కమ్యూనిజం ముఖ్యలక్షణాలు.

1 సోవియట్ కమ్యూనిజం (బ్రెజ్నెవ్ పంథా)
2 చైనా లేదా మూడో రైతాంగ కమ్యూనిజం.
3 యుగోస్లావియా సహకార మరియు సమిష్టి కమ్యూనిజం.
4 స్టాలిన్ పంథాను అనుసరించే రుమేనియా కమ్యూనిజం.
5 యూరో కమ్యూనిజం
6 ఆఫ్రో మార్క్సిస్టు కమ్యూనిజం.
7 స్వతంత్ర పంథా కమ్యూనిజం.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఏకాధిపత్యం అదృశ్యమైన తరువా సోవియట్ కమ్యూనిస్టు పార్టీ మరియు ప్రభుత్వం అనుసరిస్తున్న జాతీయ అంతర్జాతీయ విధానాలను బ్రెజ్‌నోవ్ పంథా అంటారు. దీని ప్రధా లక్షణం "సామ్యవాద సాధనకు శాంతియుత మార్గం" అమెరికా మరియు పశ్చిమ దేశాలలో అనుసరించే దిటాంట్ విధానం మరొక లక్షణ డిటాంట్ అంటే అమెరికా మరియు పశ్చిమ రాజ్యాలతో ఉద్రిక్తతలు తగ్గించుకొని సంబంధాలను మెరుగు పరుచుకోవటం, కమ్యూనిజం వ్యాప్తి

అనుసరించే విధానం "క్రమానుగత అభివృద్ధి" అంటారు. మూడవప్రపంచ దేశాలలో కమ్యూనిస్టు పార్టీలు భాగస్వాములుగాఉండే ఐక్య సంఘటనలను (యునైటెడ్ ఫ్రంట్స్) ప్రోత్సహించటం. అణుయుద్ధాన్ని నివారించి. శాంతిని పరిరక్షించటానికి ప్రయత్నం చేయటం అవసరమైతే తప్ప కమ్యూనిజం వ్యాప్తికోసం సైనిక జోక్యానికి పూనుకోకపోవటం.

మార్క్సిజం లెనినిజాన్ని చైనా రైతాంగ వ్యవస్థకు అనుగుణంగా మలచుకొని కమ్యూనిస్టు ఉద్యమాన్ని మావో విధానాన్ని చైనా పంథా అంటారు. 1980లో "స్థిరత్వం మరియు ఐక్యత అనే నినాదంపై కేంద్రీకరించటం జరిగింది. శ్రామిక నియంతృత్వం, సోషలిజమ్, మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచన, మరియు పార్టీనాయకత్వం ఆధిక్యత ఇందులో ముఖ్యమయిన సిద్ధాంతాలు. అంతర్జాతీయరంగంలో చైనా మూడు ప్రపంచాల సిద్ధాంతాన్ని బలపరుస్తుంది. ప్రత్యేక సైనిక చర్యద్వారా కమ్యూనిజం వ్యాప్తిని వ్యతిరేకిస్తుంది. అందుకే ఆఫ్ఘనిస్తాన్‌లో రష్యన్ సైనిక జోక్యాన్ని విమర్శించింది.

సహాయ మరియు సమష్టి కమ్యూనిజాన్ని ప్రవేశపెట్టింది. మార్షల్‌టిటో యుగోస్లావియాలోని రాష్ట్రాలకు అనేక అధికారాలను ఇచ్చి అధికారవికేంద్రీకరణను ప్రవేశపెట్టాడు. సమష్టి నాయకత్వ విధానాన్ని నియమం తప్పకుండా పాటించడం మరొకలక్షణం. ఆర్థికరంగంలో శ్రామికుల స్వయంయాజమాన్య పద్ధతిని ప్రవేశ పెట్టడం యుగోస్లావియా కమ్యూనిజమ్ అతి ముఖ్యమయిన లక్షణం. దూరంగాఉండి తూర్పు యూరోపు దేశాలపట్ల సానుభూతి కలిగి ఉండటం మరొక ప్రత్యేకత.

# కమ్యూనిస్టు నియంతృత్వ సాధనాలు

చరిత్రలో అతి సమర్ధవంతంగా నిర్వహించే నియంతృత్వాలలో కమ్యూనిస్టు నియంతృత్వానికి ఉన్న పేరుప్రఖ్యాతులను పోలినది మరొకటిలేదు. నియంతృత్వాన్ని పునాదిగా చేసుకొని పరిపాలించేకమ్యూనిస్టుల సాధనాలలో ముఖ్యమైనవి భయాందోళనలను సృష్టించటం భయాన్ని సృష్టించకుండా ప్రజల విధేయతను శాశ్వతంగా పొందటం అసంభవం. ఏ కొద్ది అనుమానం పైనైనా పౌరుడిని నిర్బంధించి హింసించటంనిర్బంధశ్రామికశిబిరాలకువలసపంపడం(Concentration camps) కఠినమైన జైలుశిక్షను విధించడం అవసరమైతే దేశంనుంచి బహిష్కరించడం, చివరికి ఏకపక్ష విచారణద్వారా ఉరితీయడం ఈ వ్యవస్థలో సహజమైనవి.

వీటన్నింటినీ నిర్వహించుటకు రహస్య పోలీసును కలిగిఉండటం ఒక ముఖ్యమైన విశేషం. కమ్యూనిస్టు దేశాలలో ఈ బలగంద్వారా అర్ధరాత్రి సందేశాలందుతాయి. మధ్యరాత్రి పిలుపులవల్ల ప్రజలు భీతిల్లటమే కాకుండా నిర్వీర్యులై పోతారు. రహస్య పోలీస్‌శాఖ పాత్ర ప్రభుత్వ అన్ని కార్యకలాపాలలో కనిపిస్తుంది. పార్టీ అంతర్గత సంఘర్షణలో ఈ శాఖ ప్రభావం ఎక్కువగా ఉంటుందని భావింపబడుతుంది స్టాలిన్ ట్రాట్‌స్కీ నాయకత్వం పోరాటంలో రహస్యపోలీస్ స్టాలిన్‌పక్షం వహించి ట్రాట్‌స్కీవర్గాన్ని పూర్తిగా అంతమొందించింది. దీనిఫలితంగా స్టాలినే ఎదురులేని నియంతగా చనిపోయేంత వరకూ పరిపాలించాడు.

కమ్యూనిస్ట్ వ్యవస్థలో పార్టీసభ్యులు సైనిక అధికారులు. ఉన్నత ప్రభుత్వోద్యోగులు, వివిధ అనుబంధ సంస్థల నాయకులు ప్రత్యేక హోదాను కలిగి అనేక ప్రయోజనాలను పొందుతారు.

ప్రచార సాధనాలన్నీ (పత్రికలు రేడియో టి.వి.) ప్రభుత్వ అధీనంలో పనిచేస్తాయి. ప్రజలు కేవలం అధికారసమాచారాన్నే వింటారు

(తరువాయి ప్రక్క పేజీలో)

స్టాలినిస్ట్ విధానాలను పోలి ఉన్న కమ్యూనిస్టు వ్యవస్థను రుమేనియా కలిగిఉంది. జాతీయ శ్రేయస్సుకే ప్రాముఖ్యం ఇచ్చి కమ్యూనిస్టు రాజ్యాలమధ్య ఏర్పడే వివాదాలపట్ల తటస్థ వైఖరిని అనుసరిస్తుంది. అంతర్జాతీయ వ్యవహారాలలో అలీన విధానాన్ని సమర్ధిస్తూ ఆంతరంగిక వ్యవహారాలలో స్టాలిన్ నియంతృత్వాన్ని రుమేనియా అనుసరిస్తున్నది.

యూరో కమ్యూనిజాన్ని స్థాపించిన ఘనత ఇటాలియన్ కమ్యూనిస్టుపార్టీ మాజీఅధినేత టోగిలియారికి దక్కుతుంది. "సామ్యవాదానికి విభిన్న మార్గాలు" అనే స్థిరత్వాన్ని 1962లోనే బహుళ వ్యాప్తిలోకి ఈయన తెచ్చాడు. పశ్చిమదేశాలన్నిటికంటే ఇటలీలో కమ్యూనిస్టుపార్టీ అతిశక్తివంతంగా ఏర్పడటానికి పై సిద్ధాంతం కొంతవరకూ కారణం. ఇతని వారసులైన ఇటలీపార్టీ అధినేత చిర్లింగర్, ఫ్రెంచ్‌పార్టీ అధినేత మార్కయాస్ స్పానిష్ కమ్యూనిస్టుపార్టీ నాయకుడు కారిల్లో ఈ వర్గానికి నాయకత్వం వహిస్తున్నారు. శ్రామిక నియంతృత్వం, వర్గపోరాట సిద్ధాం

---

## కమ్యూనిస్టు నియంతృత్వ సాధనాలు

ఏ ఇతరసమాచారాన్ని తెలుసుకునే అవకాశం ప్రజలకు లేదు. వాక్ స్వాతంత్ర్యం కాని పత్రికాస్వాతంత్ర్యం కాని సమావేశ స్వేచ్ఛ కాని వారికి లేదు.

కమ్యూనిస్టు రాజ్యంలో ఉన్న అన్ని సంస్థలు ముఖ్యంగా కార్మిక సంఘాలు, విద్యార్థియువ సంఘాలు మహిళా సంస్థలు) కేవలం పార్టీ అధిపత్యంలోనే పనిచేస్తాయి.

బాహ్య ప్రపంచంతోకాని, పొరుగు రాజ్యాలతోగాని ప్రజలకు ఏ విధమైన సంబంధాలకు అవకాశంలేకుండా చేయడం కమ్యూనిస్టు నియంతృత్వంలో ప్రధానమైనది. దీనినే ఐరసికర్టెన్ లేదా బాబూకర్టెన్ అంటారు.

---

## వారసత్వ హక్కును బలపరిచే కమ్యూనిస్టు వ్యవస్థ

ఫ్యూడలిజమ్ వంశపారంపర్య రాజరికం అంత మొందుతున్న సమయంలో ఈ జాడ్యం కమ్యూనిస్టు వ్యవస్థకు పరిమితమవటం చాలా శోచనీయం. మార్క్స్, లెనిన్‌లే బ్రతికిఉంటే వారు స్థాపించిన ఈ వ్యవస్థకు పట్టిన గతినిచూచి అంతమవుతున్న ఫ్యూడలిజాన్ని పునరుద్ధరించే వారేమో?

ఉత్తర కొరియా కమ్యూనిస్టు అధినేత కిం-11-సంగ్ తన కుమారుడిని తన రాజకీయవారసుడిగా అధికారికంగా ప్రకటించాడు. బల్గేరియా కమ్యూనిస్టు అధినేత ఝివకోవ్ తన కూతురైన ల్యూడ్మివాకోవ్‌ను పోలిట్‌బ్యూరో సభ్యురాలిగా చేసి వంశపారంపర్య వారసత్వానికి పునాది వేశాడు. రుమేనియా అధినేత సిసెస్క్యూ (CEAU SESCU) తనభార్య ఎలేనాను మంత్రివర్గంలోకి తీసుకొని రెండవ శక్తివంతమయిన వ్యక్తిగా రూపొందించాడు. తనకుమారుడు నీక్యూ (NICU) ప్రతిష్ఠాత్మకమైన కమ్యూనిస్టు యూత్ సెక్రటరీగా నియమించాడు. ఇది చాలదన్నట్టు అతని బావమరుదులను (ఏడుగురు) పార్టీ ప్రధాన పదవులలో ఇరికించాడు.

క్యూబా అధినేత కాస్ట్రో తనతమ్ముడు రావుల్ కాస్ట్రోను కమ్యూనిస్టుపార్టీకి కార్యదర్శి మరియు రక్షణమంత్రిగా నియమించాడు. బ్రతుకుతెరువుకోసం స్వేచ్ఛను వదులుకొని భూతల స్వర్గమని భావిస్తూ కమ్యూనిజంవైపుకు పరుగులుదీసే అమాయక ప్రజలు భావోద్రేక యువకులుపొందే సందేశం వారసత్వ కమ్యూనిస్టు నియంతృత్వంపై పోరాడండి!!

---

తాలను వదులుకొని ప్రజాస్వామ్యపద్ధతులలో కమ్యూనిస్టు లక్ష్యాలను ఇతర రాజకీయ పార్టీలతో సహకరిస్తు స్థాపించటం వారిధ్యేయం. దాని 1980 ఏప్రిల్‌లో పారిస్‌లో జరిగిన సమావేశంలో తిరిగి పునరుద్ధరించారు అంతర్జాతీయ వ్యవహారాలలో సైనిక జోక్యాన్ని బలప్రయోగాన్ని

యూరో కమ్యూనిజం వ్యతిరేకిస్తుంది. ప్రైవేటు ఆస్తిని అనుమతిస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే సాంప్రదాయక మార్క్సిజాన్ని యురో కమ్యూనిజం తలక్రిందులు చేసింది!



ఆఫ్రో మార్క్సిజం ఇటీవలే ప్రారంభమయింది. కమ్యూనిస్టుపార్టీ ప్రమేయంలేకుండాసోషలిజమ్‌వైపుకు మొగ్గకున్నకొన్ని ఆఫ్రికన్‌రాజకీయ పార్టీలు ముఖ్యంగా అంగోలా, మొజాంబిక్, ఇథియోపియా-సిద్ధాంతాన్ని బలపరుస్తున్నాయి. రష్యా సైనిక సహాయంతో కమ్యూనిస్టు వ్యవస్థను తమదేశంలో ప్రవేశపెట్టి కమ్యూనిజం వ్యాప్తికి దోహదం చేస్తున్నాయి. సైద్ధాంతికంగా ఈవర్గం ఇంకా శైశవ దశలోనే ఉన్నది.



కమ్యూనిస్టేతర దేశాలలో కమ్యూనిస్టు ఉద్యమాలు పైపైన చర్చించిన అంశాల ప్రభావం ప్రస్ఫుటమవుతున్నది. గత కమ్యూనిస్టు వైభవాన్ని నెమరువేస్తూ మూడవ ప్రపంచదేశాలలోని ప్రజలు, ముఖ్యంగా యువతరం కమ్యూనిజంవైపు ఆకర్షించబడుతున్నది. ఆర్థిక సాంఘిక పరిస్థితుల ప్రభావంవల్ల ఈ ఉద్యమాలకు వెనుకబడిన దేశాలలో కొంత బలం చేకూరుతున్నది. వారి క్లిష్ట సమస్యలకు కమ్యూనిజం ఒక్కటే ప్రత్యామ్నాయ సంస్కార మార్గమని భావిస్తే ఇండోచీనా రాజ్యాలలో కమ్యూనిస్టు వ్యవస్థ స్థాపించిన "ప్రగతి" వీళ్ళ ఆశలను వమ్ముచేస్తుంది.



మూడవ ప్రపంచరాజ్యాలలో కమ్యూనిజం ఆశించినంతగా వ్యాప్తి చెందలేదు. దాన్ని ఒక ప్రబలకారణం అనుకొన్నంత అభివృద్ధిని కమ్యూనిస్టు రాజ్యాలు సాధించలేకపోవటమే సోవియట్ రష్యాను ఉదాహరణగా తీసుకోటానికి వీలులేదు.

ఎందుకంటే రష్యా తూర్పు యూరపు రాజ్యాలలో కమ్యూనిజం వచ్చేనాటికి పారిశ్రామిక వ్యవస్థ కొంతవరకూ ఏర్పడిఉంది. భారతదేశం వంటి రాజ్యానికి రష్యాకు ఉన్నటువంటి అపారమైన ఖనిజసంపద, లేని యూరోప్ రాజ్యాలలో ఉన్న పారిశ్రామిక పునాదులు లేవు. చైనాతో పోలిస్తే ఆదేశం మనదేశంకంటే మూడింతలు వైశాల్యం కలిగి ముప్పై మూడు సంవత్సరాల కమ్యూనిస్టు పాలనలో అభివృద్ధి చెందలేదు. అంతే కాక మనదేశం కమ్యూనిజం వైపు మొగ్గితే కంపూచియా అనుభవం పునరావృత్తం కావచ్చు. లేదా ఇథియోపియా క్యూబాలవలె శాశ్వతంగా రష్యాపై ఆధారపడటం జరగవచ్చు. క్యూబాలో కాస్ట్రో ప్రభుత్వాన్ని పోషించటానికి రష్యాకు రెండు మిలియన్ల డాలర్ల ఖర్చు అవుతున్నది! ఇథియోపియా వల్లకూడా ఇంచుమించుగా ఇంత వ్యయం అవుతున్నది.

బలహీనమైన మూడవ ప్రపంచరాజ్యాలలో కమ్యూనిస్టు వ్యవస్థ ఏర్పడితే సాధించవలసిన ప్రగతి సాధించలేకపోగా అగ్ర కమ్యూనిస్టు రాజ్యానికి శాశ్వత "కట్టుబాటు" రాజ్యాంగ ప్రమాదం లేకపోలేదు. దాని వల్ల పెట్టుబడిదారి సామ్రాజ్యవాదుల స్థానంలో కమ్యూనిస్టు సామ్రాజ్య వాదులు అవతరిస్తారు.





# దారి తప్పిన నక్సలైట్లు

1962లో భారతదేశంపై చైనా దురాక్రమణ జరిపిన తర్వాత భారత కమ్యూనిస్టు పార్టీలో విభేదాలు ఏర్పడ్డాయి. చైనా చర్యను సమర్థించిన వర్గం సి.పి.ఐ (మార్క్సిస్ట్) పార్టీగా 1964లో ఏర్పడింది. సి.పి.ఎం లోని అతివాదులు-చైనాను ఆదర్శంగా తీసుకొని దౌర్జన్య పద్ధతులద్వారా అధికారాన్ని సంపాదించాలని మరొకసారి చీలి 1969లో భారత కమ్యూనిస్టు (మార్క్సిస్ట్ లెనినిస్ట్) ని స్థాపించుకొన్నారు.

1967లో పశ్చిమ బెంగాల్ ఐక్య సంఘటన ప్రభుత్వం (సి.పి.ఐ (ఎం) భాగస్వామ్యంలో) ఏర్పడిన తరవాత చారూ మజుందార్, కనూ సన్యాల నాయకత్వంలో ఆ రాష్ట్రంలోని నక్సల్ బరీ ప్రాంతంలో సాయుధ తిరుగుబాటు ఉద్యమాన్ని నిర్వహించటం జరిగింది. ఈ ఉద్యమమే క్రమంగా నక్సల్‌బరీ ఉద్యమంగా పేరు పొంది దేశంలోని వివిధ ప్రాంతాలకు వ్యాప్తి చెందింది.

## నక్సలైట్ తత్వము

భారత నక్సలైట్స్ చైనానే తమ మార్గంగా చైనా అధ్యక్షుడిని తమ అధ్యక్షుడిగా ప్రకటించుకొన్నారు. చైనాకూడా నక్సల్‌బరీ ఉద్యమాన్ని బలపరుస్తూ పెకింగ్ రేడియోద్వారా, వారదినపత్రిక అయిన 'పీపుల్స్‌డైలీ' ద్వారా ప్రచారంచేస్తూ వచ్చింది. అంతటితో ఆగక నక్సలైట్ నాయకులకు శిక్షణ, ధన సహాయం, ఆయుధాల సరఫరా అందిస్తూ వారిని ఇతోధికంగా ప్రోత్సహించింది.

భారతదేశంలో ఉన్నది అర్ధ భూస్వామ్య వ్యవస్థ అని అర్థవలన తత్వపాలన అని కమ్యూనిస్ట్ విప్లవకారులు భావిస్తారు. భారత ప్రభుత్వం జమిందారుల మహారాజుల, పెద్ద భూస్వాముల ప్రతినిధి మాత్రమేనని, అమెరికా, రష్యా సామ్రాజ్య వాదుల చేతుల్లో కీలుబొమ్మ అని వారు విశ్వసిస్తారు. అందువల్ల ఈ ప్రభుత్వాన్ని పడగొట్టాలనీ దానికి ఏకైకమార్గం సాయుధ పోరాటం ఒక్కటే అని నక్సలైట్స్ వాదిస్తారు.

చట్టబద్ధంగా ఎన్నికైన ప్రభుత్వాన్ని సాయుధ విప్లవంద్వారా కూలదోయటం నక్సలైట్స్ తమ లక్ష్యంగా పెట్టుకున్నారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో వీరికి నమ్మకంలేదు. అందుకనే ఎన్నికలను బహిష్కరించాలన్న పిలుపునిచ్చారు.

నక్సలైట్ల కార్యక్రమంలో ముఖ్యమైనది వర్గశత్రువులను తుద ముట్టించడం సాయుధ పోరాటం ప్రధానంగా దీనివల్లనే వస్తుందని వారు నమ్ముతారు. వర్గశత్రుల రక్తంలో చేతులు ముంచనివాడు తమ కమ్యూనిస్టని చెప్పుకోటానికి వీల్లేదని చారూమజుందార్ ఒక సందర్భంలో ప్రకటించారు.

## శ్రీకాకుళం ఉద్యమం

భారతదేశ ఎనాక్‌గా వర్ణింపబడ్డ శ్రీకాకుళంలో ప్రారంభమైన, గిరిజన ఉద్యమంతో ఆంధ్రప్రదేశ్‌లో నక్సలైట్ ఉద్యమం ప్రారంభమయిందని చెప్పవచ్చు, ఉద్యమం ప్రారంభం కావటానికి ఇక్కడ అనేక స్థానిక సమస్యలు తోడ్పడ్డాయి. ఒకటి, మైదాన ప్రాంతాలవారు అక్కడి భూములను ఆక్రమించుకోవడం, రెండు, గిరిజనులకు అధిక వడ్డీకి అప్పులిచ్చి వారిని కట్టుబానిసలుగా చేసుకోవడం, మూడు శ్రీకాకుళం ఏజెన్సీ ప్రాంతం చొరశక్యంకాని అటవీ మయం అవడం, ఉద్యమకారులకు తొలిదశలో బాగా ఉపయోగపడింది. పైగా పొరుగు రాష్ట్రమైన ఒరిస్సా సరిహద్దులు పర్వతమయమై ఉండటం విప్లవకారులకు తలదాచుకోటానికి సహాయకారి అయింది.

నిజానికి శ్రీకాకుళంలో గిరిజనోద్యమాన్ని ప్రారంభించింది నక్సలైట్ విప్లవకారులూ కాదు. కమ్యూనిస్ట్ పార్టీవారూకాదు. కేవలం ఉపాధ్యాయ వృత్తిని చేపట్టిన రామం, ఆదిభొట్ల కైలాసం, వెంపటాల సత్యనారాయణ గిరిజన ప్రాంతాలకు బదలీ అవటంవల్ల అక్కడి ప్రజల వెనుకబాటుతనం, భూస్వాముల, సాహుకార్ల దోపిడీవల్ల వారిలో ఏర్పడిన నిస్పృహాయత, నైరాశ్యములచే ప్రేరేపింపబడి అసహాయ గిరిజనులను చైతన్య వంతులుగా చేయటానికి చేసిన ప్రయత్నాలే గిరిజనోద్యమానికి నాంది పలికాయి. 1960 నుండి ప్రారంభమైన వీరి కార్య కలాపాల వల్ల క్రమంగా దాదాపు అన్ని ఏజన్సీ ప్రాంతాలు గిరిజన సంఘాల పలుకబడి కిందకు వచ్చాయి. 1967 నాటికే వారు కొన్ని లక్షల రూపాయల అప్పులను మాఫీ చేయించుకొన్నారు. అన్యాక్రాంతమైన భూమిని కొంత వరకూ వంశంచేసుకొన్నారు.

కాగా భారత కమ్యూనిస్ట్ పార్టీ (మార్క్సిస్ట్)లో ఏర్పడిన చీలిక ఫలితంగా ఉద్భవించిన సి.పి.ఐ (ఎం.ఎల్) చారు మజుందార్ నేతృత్వంలో అప్పటికే ఒక గిరిజనోద్యమాన్ని తన ప్రభావంకిందకు తీసుకురావటానికి సాయుధ పోరాటానికి అనువైన ప్రాంతంగా భావించి ముందుకు వచ్చింది. ఇక్కడ ప్రారంభమైన ఉద్యమం క్రమంగా ఇతర మైదాన ప్రాంతాల్లోకి, దారిద్ర్యం నిరక్షరాస్యత, సాంఘిక అసమానతలు ఉన్న ప్రదేశాలకుకూడా వ్యాపించింది.

గత శతాబ్దంలో యావత్ భారతదేశాన్నేకాకుండ ప్రపంచస్థాయిలో ప్రాచుర్యంపొందిన శ్రీకాకుళ గిరిజనోద్యమం కేవలం నక్సలైట్స్ మాత్రమే సృష్టించిందికాదని, చిత్తశుద్ధితో తమ కర్తవ్యాన్ని నిర్వహించటానికి సామాజికస్పృహ కలిగిన ఉపాధ్యాయుల కృషి ఫలితంగా రూపొందిన ఉద్యమమని స్పష్టము.

# పరస్పర నిందారోపణలకు పాల్పడుతున్న నక్సలైట్ వర్గాలు

వర్గశత్రువులను నిర్మూలించి ప్రజలను ఉత్తేజపరచి సాయుధ పోరాటం ద్వారా ప్రస్తుత ఆర్థిక రాజకీయ సామాజిక వ్యవస్థలను కూలదోస్తాం అంటున్న కమ్యూనిస్టు విప్లవకారులు హంతకులుగా దిగజారి, విప్లవావసరాలను డబ్బు సంపాదన పేరుతో "ఆర్థిక చర్యలు" కొనసాగిస్తూ బందిపోటు దళాలుగా తయారయ్యారు.

గ్రామాల్లోను, పట్టణాలలోనూ దోపిడీ వర్గాలు, పాలకపక్షం తమ ప్రత్యర్థులను తుదముట్టించటానికి నక్సలైట్స్ కిరాయి హంతకులుగా ఉపయోగపడుతున్నారు. దీనివల్ల రెండులక్షణాలు నెరవేరుతాయని వారు భావిస్తారు. ఒకటి వర్గశత్రువునిర్మూలన, రెండు, విప్లవ కార్యకలాపాలకు ధనార్జన.

అయితే వాస్తవంలో పైరెండులక్ష్యాలకు తిలోదకాలు ఇచ్చినట్లు కనిపిస్తుంది. హత్యలు, దోపిడీలు చేసి సంపాదించిన డబ్బు ఎవరికి వారే స్వంతానికి ఖర్చుచేసుకోవడం, పరస్పర హత్యలు గావించుకోవటం ఒకసాధారణ విషయమయిందని వారే ఒక వర్గాన్ని దూషించడం మరోవర్గం చేసే విమర్శలు ద్వారా ప్రకటించుకొంటున్నారు. మచ్చుకోసం కొన్ని ఉదాహరణలు.

"చెడిద చెన్నయ్య నాయకత్వంలో వరంగల్ జిల్లాలో జరిగిన (1969-70) ముప్పైదాడులలో ఏ ఒక్కదాడీ భూస్వామిపై జరుగలేదు. చిన్న వ్యాపారస్థులు సామాన్యుల ఇళ్ళపైబడి దొరికినంత

(తరువాయి ప్రక్క పేజీలో)

# పరస్పర నిందారోపణలకు పాల్పడుతున్న నక్సలైట్ల వర్గాలు

వరకూ దొంగిలించుకొని పోయారు. అలా దొంగిలించిన డబ్బులో కొంతభాగం తన ఇంటికి చేరవేసుకొన్నాడు" (క్రాంతి 3-1-1977)

2. "విప్లవవిద్రోహి వై.ఎస్. మూర్తిని లిన్‌పియావో గ్రూపు నుండికూడ తొలగించినట్లుతెలుస్తున్నది ఆయాజిల్లాలలో గూండాలతో సంబంధాలు పెట్టుకొని భూస్వాములకు, కిరాయి గుండాలుగా ఉంటూ ఇద్దరు ప్రభుత్వోద్యోగులను హత్యచేసినందుకు పార్టీకి తెలియకుండా గుండాలను వెనకేసుకొని సామాన్యుల ఇండ్లమీదపడి లూటీలు చేస్తున్నందుకు ఆ గ్రూపు ఖండించినట్లు తెలుస్తున్నది" (క్రాంతి 15-11-1979)

3. వర్గశత్రువుల నిర్మూలనకై శిక్షణ పొందిన కార్యకర్తలు ఆభూస్వామ్య శక్తులకే కిరాయి హంతకులుగా తమసేవలను అమ్ముకోజూపడం కూడా నాయకులకు ఆందోళన కలిగిస్తున్నది.... అనేక ముఠాలుగా చిన్నాభిన్నమయి పరస్పర ద్వేషపూరిత గ్రూపులతో కూడిన ఉగ్రవాద నాయకులు శత్రుల నుండేకాక మిత్రులనుండి ప్రాణభీతితో కాలంగడుపుచున్నారు."

(ఆంధ్రప్రభ 29-9-1980)

నక్సలైట్ ఉద్యమంలో సంఘ వ్యతిరేక శక్తుల ప్రాబల్యం అధికంగా ఉందనటానికి ఈ వాక్యంచాలు "సంఘ వ్యతిరేకశక్తులు ఈ సమాజంలో బాధితులు. అందుకే వారు సమాజానికి వ్యతిరేకంగా ఉన్నారు. వారిలో ఉన్న ఈ వ్యతిరేకతను రాజకీయ మార్గంలోకి మరల్చు కున్నట్లైతే చక్కటి విప్లవకారులుగా తయారవుతారని చారూ మజుందర్ సిద్ధాంతీకరించారు. ఒకపాలసీగానే సంఘవ్యతిరేక శక్తుల్ని తమపార్టీలో బాగాచేర్చుకొన్నాడు. "(దక్షిణఆసియారివ్యూజనవరి1971)

1968 అక్టోబర్‌లో శ్రీకాకుళం విప్లవకారులు పంచాద్రి కృష్ణమూర్తి చౌదరి తేజేశ్వరరావు కలకత్తాలో చారూమజుందార్‌తో జరిపిన సంభాషణ ఫలితంగా సాయుధ పోరాటాన్ని ప్రారంభించటానికి నిర్ణయం తీసుకోవటం జరిగింది. గరుడ భద్రగ్రామంలో మొట్టమొదట దోపిడీ జరిగింది. అటు తరువాత వెంట వెంటనే అనేక దోపిడీలు జరిగి ఉద్యమం తీవ్రస్థాయిలో చేరుకొంది.

1969 మార్చి 11న తరిమెల నాగిరెడ్డి రాష్ట్ర శాసనసభ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి తమ ప్రజావిప్లవాన్ని నడపటానికి నిర్ణయించుకొన్నట్లు ప్రకటించారు.

1969 మే 14న విశాఖపట్నం జిల్లాలోని పెద మడివాడలో ఒక దారుణ హత్య జరిగింది. ఈ కేసులలో నాగభూషణం పట్నాయక్‌కు మరణశిక్ష పడింది. (తరువాత దానిని యావజ్జీవ కారాగార శిక్షగా మార్చారు. ఇటీవలే ఆయనను అనారోగ్య కారణాలరీత్యా పెరోల్‌పై విడుదల చేసారు.

## ప్రభుత్వ చర్యలు

నక్సలైట్ల భయాన్ని తొలగించడానికి స్థానిక పోలీసు బలగం చాలక పోవడంతో ప్రత్యేక సాయుధ పోలీసు దళాలను సి.ఆర్.పి. బలగాన్ని ప్రభుత్వం శ్రీ కాకుళంలో మొహరించింది. కమ్యూనికేషన్ల సదుపాయాలను కల్పించి నక్సలైట్లను అణిచివేయటానికి పోలీసుకు ప్రత్యేక అధికారాలను ఇచ్చి ఈ ప్రాంతాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రభుత్వం ప్రకటించింది.

నక్సలైట్ ఉద్యమానికి సంబంధించినవివరాలను 1977లో భార్గవ కమీషన్‌కు నాటి ఐ.జి పి సమర్పించిన నివేదికను అనుసరించి 1968-77 మధ్యకాలంలో మొత్తం 983 కేసులు నమోదైనాయి. వీటికి 148హత్యలకు

సంబంధించినవి. 171 బందిపోటు దొంగతనాలు, 615 పోలీసులపైనా పోలీసు స్టేషన్ల పైనా జరిపిన దాడులకు సంబంధించిన కేసులు ఉన్నాయి. ఈ 918లో 232 కేసులలో విచారణ జరిగింది. నేరం రుజువై నిందితులకు శిక్షలు విధించారు.

1969 డిసెంబర్ 17న తరిమెల నాగిరెడ్డి మరో 8మంది మద్రాన్ లో అరెస్టయ్యారు. దీనికి సంబంధించిన కేసులో నాగిరెడ్డికి, మరో 22 మందికి కఠినశిక్ష పడింది.

చౌదరి తేజేశ్వరరావు, నాగభూషణం పట్నాయక్, వెంపటాపు సత్యనారాయణ మొదలైనవారు చారూమజుందార్, కానూసన్యాల్ సహకారంతో 1970లో ప్రభుత్వాన్ని కూలదోయటానికి ప్రయత్నించారన్న ఆరోపణపై విచారణ జరుపగా కానూసన్యాల్, శౌరిన్‌బోన్, పట్నాయక్, తేజేశ్వరరావు. కొల్లావెంకయ్య మొదలైన 17మందికి యావజ్జీవ కారాగార శిక్ష పడింది. మరో ఇద్దరికి 5 సంవత్సరాలు కఠినశిక్ష విధించడం జరిగింది. విప్లవ రచనలైన ఝుంఝుం, సృజన విప్లవం వర్ధిల్లాలి, పిలుపు మొదలైన నక్సలైట్ సాహిత్య పత్రికలను గ్రంథాలను రాష్ట్రప్రభుత్వం నిషేధించింది.

## ఉద్యమ వైఫల్యం

అరుణ ప్రాంతంగా ప్రసిద్ధిచెందిన శ్రీకాకుళం అనతికాలంలోనే స్తబ్ధతలో మునిగిపోయింది. ప్రభుత్వ అణచివేత చర్యలతో "ఎదురు కాల్పుల" కార్యకలాపాలతో అతి స్వల్పకాలంలో శ్రీకాకుళంలో ప్రారంభమైన నక్సలైట్ ఉద్యమం నామమాత్రంగా మిగిలిపోయింది. పార్వతీపురం కుట్రకేసు విచారణ సందర్భంలో కొల్లా వెంకయ్య, నాగభూషణం పట్నాయక్, భువనమోహన్ పట్నాయక్, మేడవరపు సీత, వెంపటాపు భారతి మొదలైనవారు 1976 మే మొదటివారంలో విశాఖ ప్రత్యేక సెషన్స్ కోర్టులో శ్రీకాకుళం ఉద్యమం విఫలమయిందని అంగీకరించారు.

| పేరు | ముసుగు సంస్థలు |
| --- | --- |
| 1. కొండపల్లి సీతారామయ్య వర్గము (పీపుల్స్ వార్ గ్రూప్) | 1. రాడికల్ విద్యార్థి సంఘము (ఆర్. యస్. యు)<br>2. రాడికల్ యువజన సంఘము (ఆర్. వై. ఎల్)<br>3. రైతు కూలీ సంఘము<br>4. పౌరహక్కుల సంఘము<br>5. అభ్యుదయ మహిళా సంఘము<br>6. విప్లవ రచయితల సంఘము<br>7. జననాట్యమండలి (గద్దర్ గ్రూప్) |
| 2. చండ్రపుల్లారెడ్డి వర్గము (భారత కమ్యూనిస్ట్ పార్టీ మార్కిస్ట్ లెనినిస్ట్) | 1. ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘము (పి. డి. యస్. యు.)<br>2. ఐ. ఎఫ్. టి. యు. (ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్)<br>3. అభ్యుదయ మహిళాసంఘము<br>4. రైతు కూలీ సంఘము |
| 3. దేవులపల్లి వెంకటేశ్వరరావు వర్గము (భా. క. పా విప్లవకారుల సమన్వయ కమిటీ) | 1. ప్రజాతంత్ర విద్యార్థి సంఘము (డి. ఎస్. ఓ.)<br>2. పౌరహక్కుల సంఘము (ఓ. పి. డి. ఆర్.)<br>3. అభ్యుదయ మహిళా సంఘము<br>4. జనసాహితి (రచయితల సంఘము) |
| 4. రవూఫ్ గ్రూప్ (లిన్‌పియోకి వ్యతిరేకము, దుష్ట చతుష్టయానికి అనుకూలము) | 1. రైతు కూలీ సంఘము<br>2. విప్లవ మహిళా సంఘము<br>3. సివిల్ లిబర్టీస్ యూనియన్ |
| 5. లిన్‌పియోపో గ్రూప్ | 1. రైతు కూలీ సంఘము<br>2. పౌరహక్కుల సంఘము |

# నక్సలైట్ వర్గాలు – వాటి సంస్థలు

| ప్రచార సాధనాలు (పత్రికలు) | కార్యకలాపాల కొనసాగుతున్న ప్రదేశాలు | ఇతర వివరాలు |
|---|---|---|
| 1 రాడికల్ మార్చ్<br>2 క్రాంతి<br>3 సృజన<br>4 కరపత్రాలు<br>5 పోస్టర్లు<br>6 వినోద కార్యక్రమాలు (గద్దర్ గ్రూప్ నిర్వహిస్తుంది)<br>7 రాడికల్ వాయిస్ (గోడ పత్రిక) | వరంగల్<br>ఖమ్మం<br>కరీంనగర్<br>ఆదిలాబాద్<br>జిల్లాలు | రహస్య బహిరంగ కార్యక్రమాలు రహస్య సాయుధ దళాలు ఉన్నాయి. ఎన్నికల బహిష్కరణ తుపాకి గొట్టం ద్వారా రాజ్యాధికారం వస్తుందనే మావో సూత్రాన్ని నమ్ముతారు. వీరివిద్యార్థిసంఘాలు రాష్ట్రమంతటా కనిపిస్తాయి. ఇండో చైనా మిత్రమండలి నుండి సహాయం లభిస్తుందని భావించబడుతున్నది. |
| 1 విమోచన్<br>2 విజృంభణ<br>3 ఫోకస్ (గోడ పత్రిక)<br>4 గోడమీదవ్రాతలు | ఖమ్మం<br>కరీంనగర్<br>వరంగల్<br>ఆదిలాబాద్<br>జిల్లాలు | పార్లమెంటరీ వ్యవస్థను, ఎన్నికలను ఉపయోగించుకుంటారు. వీరి విద్యార్థి సంఘాలు రాష్ట్రమంతటా వ్యాప్తిలో ఉన్నాయి. గత అసెంబ్లీ ఎన్నికలలో ఇల్లెందు నియోజకవర్గం నుంచి ఎన్నికయిన బాసల ఎర్రయ్య ఈ పార్టీని వదిలి కాంగ్రెస్ (ఐ) లో చేరారు. ఇండో చైనా మిత్రమండలి నుండి సహాయం లభిస్తుందంటున్నారు |
| 1 జనశక్తి<br>2 పొలెటేరియన్ లైన్<br>3 గోడమీదవ్రాతలు<br>4 ఆలోచన<br>5 సంకేతం | ఖమ్మం<br>వరంగల్ | పూర్వం ఈ వర్గం నాగిరెడ్డి గ్రూపుగా పని చేసింది. రహస్య, బహిరంగ కార్యక్రమాలు, ఎన్నికల బహిష్కరణ విద్యార్థి సంఘాలు అనేక జిల్లాల్లో ఉన్నాయి. |
| 1 నక్సల్‌బరి వేకువ | ఖమ్మం<br>వరంగల్ | రహస్యసాయుధదళాలుఉన్నాయి. ఎన్నికలనుబహిష్కరిస్తారు. వర్గశత్రు వ్యక్తి నిర్మూలన జరగాలంటారు. |
| | ఖమ్మం<br>వరంగల్ | ఎన్నికలను బహిష్కరిస్తారు. కొద్ది సంఖ్యలో సాయుధ ముఠాలు ఉన్నాయి. |

1969 ప్రారంభంలో శ్రీకాకుళం ప్రాంతాలను పర్యటించి అక్కడ "కమ్యూనిస్టు" విప్లవకారులు వెలిగించిన నిప్పురవ్వ దావానలంలా వ్యాపించి పోతున్నదని, అఖిలభారత దేశానికి ఒక "ఎనాక్"గా తయారవుతుందని" నివేదిక వ్రాసిన చారూ మజుందార్ ఏడాది తిరగకముందే పోలీసు నిర్బంధకాండద్వారా శ్రీకాకుళంలో నక్సలైట్ కార్యకలాపాలు అణచివేయబడ్డాయని అనేక వ్యాసాలలో (లిబరేషన్ 1969-70) ప్రకటించుకొన్నారు.

"భారతదేశంలో ప్రజాయుద్ధ పంథాకు సంబంధించిన కొన్ని సమస్యలు" అనే తీర్మానంలో దేవులపల్లి వెంకటేశ్వరరావు వర్గం శ్రీకాకుళంలో అర్గుణ ప్రాంతాల్లో ఏర్పడ్డమనడం సత్యదూరమని నిర్ధారించింది. కాగా నక్సల్‌బరీ శ్రీకాకుళం ఉద్యమాలకు పెద్దస్థాయిలో ప్రచారంచేసి సమర్థించిన చైనా కమ్యూనిస్టుపార్టీ కూడా భారతదేశంలో సాయుధ పోరాటం విఫలమైందన్న సత్యాన్ని గుర్తించింది.

శ్రీకాకుళంలో ప్రారంభమై నల్గొండ, కరీంనగర్, వరంగల్, ఆదిలాబాద్, ఖమ్మం, కృష్ణా, గుంటూరుజిల్లాలకు వ్యాప్తి చెందిన నక్సలైట్ ఉద్యమాలు అనేక చీలికలకు లోనయి ప్రభుత్వ చర్యల ఫలితంగా ఇతర కారణాలరీత్యా ఈనాడు నామమాత్రంగా మిగిలిపోయి అక్కడక్కడ చెదురుమదురుగా కనిపిస్తున్నాయి. గ్రామీణ ప్రాంతాలలో విఫలమైన తీవ్రవాదుల దృష్టి ప్రస్తుతం నగరాలలో ముఖ్యంగా విశ్వవిద్యాలయాలు విద్యాసంస్థలపై కేంద్రీకృతమైంది.

ఆంధ్రప్రదేశ్‌లో నక్సలైట్ ఉద్యమం విఫలం అవటానికి ఈ క్రింది కారణాలు ప్రధానంగా కనిపిస్తాయి.

1. గత శతాబ్దంగా ఎవరివారు (వివిధ గ్రూపులు) తమ పంథాయే సరయినదని ఉద్యమం ముందుకు సాగిపోతున్నదని చెబుతున్నా

వాస్తవంలో ప్రజా ఉద్యమ నిర్మాణం జరగలేదని ప్రజా ఉద్యమం కోసం అంకితంఅయిన కార్యకర్తలపై హత్యా ప్రయత్నాలు గూండా చర్యలతోపాటు భూస్వామ్య వర్గాలకు సహాయకులుగా తయారవటం జరిగిందని ఒకనాటి ప్రముఖ నక్సలైట్ నాయకుడయిన చౌదరి తేజేశ్వరరావు ఇటీవలే విమర్శించారు.

2. విప్లవ ఉద్రిక్తత ప్రభావం చాలావరకూ నీరుకారిపోయింది. శ్రీకాకుళం ఉద్యమం ప్రారంభంనాటి చిత్తశుద్ధి దృఢనిశ్చయంగల కార్యకర్తలు ఇవ్వాళ లేరు. ఒకనాడు విశ్వవిద్యాలయాల నుంచి మేధావి వర్గం నుంచి ఆకర్షింపబడి నక్సలైట్ ఉద్యమంలోకి దుమికిన మెడికోలు ఇంజనీరింగ్ విద్యార్థులు, డాక్టర్లు, టీచర్లు ఇవ్వాళ కనబడరు. కేవలం ప్రచారం కోసం ప్రాబల్యంకోసం తాత్కాలికంగా ప్రాముఖ్యంకోసం తిరిగేవారు ఉపన్యాసాలు దంచేవారేకానీ గ్రామీణప్రాంతాలలోకి వెళ్ళి అక్కడి బడుగు ప్రజానీకం సమస్యలను అవగాహన చేసుకొని ఉద్యమ నిర్మాణానికి కృషిచేసేవారు భూతద్దం పెట్టుకొని వెతికినా కనబడటంలేదు. వ్యావసాయిక విప్లవంకంటే సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదం ఈనాటి నక్సలైట్లకు తీవ్ర సమస్య అయింది! కేవలం గోడలమీద వ్రాతలతో, నినాదాలతో, కరపత్రాలతో తృప్తి పడుతున్నారు.

3. కమ్యూనిస్టు సిద్ధాంతము, ఆచరణ మనకు స్వతహాగా అబ్బినవికావు. కేవలం దిగుమతిచేసుకున్న ఆదర్శాలుగా సామాన్య జనానికి అర్థంకాని పదజాలంతో డబ్బాలోపోసిన రాళ్ళలా తారకమంత్రంగా ఉచ్చరించే సిద్ధాంతాలు మన పాటక జనాన్ని ఆకర్షించలేకపోతున్నాయి. దళిత హరిజన, గిరిజన వర్గాల అభివృద్ధికోసం ఒకవైపు ప్రభుత్వం నిర్వహిస్తున్న కార్యకలాపాలూ హింసావాదాన్ని ప్రచారంచేస అనుసరిస్తూ అక్కడక్కడ చెదురుమదురుగా జరుపుతున్న ప్రవాసుల చర్యలూ ప్రజలను నక్సలిజమ్‌నుంచి దూరం చేస్తున్నాయి.

4. ప్రజలలో ఎంత అసంతృప్తి పెరిగినప్పటికీ- పేదరికం, నిరుద్యోగం ఆకాశాన్ని అంటే ధరలు ఇంకా వారిని ఆకర్షించి ఆకట్టు కొనేశక్తి, పాలకవర్గానికి తగ్గలేదు. మితవాదపక్షాలయిన కాంగ్రెస్, జనత లోక్‌దళ్ బి.జె.పి. సి.పి.ఐ. సి.పి.యం. (చివరి రెండూ నక్సలైట్ల దృష్టిలో విప్లవ విద్రోహ పార్టీలు) ఎన్నికల్లో సంపాదిస్తున్న ఓట్ల శాతం దీనికి నిదర్శనం. ఈ సత్యాన్ని గ్రహించకుండా నక్సలైట్ ఉద్యమ కారులు ప్రభుత్వం ప్రజలనుండి దూరమైందనీ, విప్లవ దశపరి పక్వ మైందని సాయుధపోరాటం తక్షణ కర్తవ్యమనీ పాతపాటే ఇంకా పాడు తున్నారు.

ప్రజల మద్దతు లేకుండా ఏ ఉద్యమం ఏ విప్లవం విజయాన్ని సాధించలేదు. స్థానిక అవసరాలకు అనుగుణంగా మూల సిద్ధాంతంలో కూర్పులు చేర్పులు చేసుకుని ప్రజాబలంతో ముందుకుసాగిన ఉద్యమాలే

---

## రాష్ట్రస్థాయిలో సి. పి. ఎం. ఎల్. (నక్సలైట్స్) కులగోత్రాలు

భారత కమ్యూనిస్టు విప్లవకారులు ఎన్ని వర్గాలుగా ఉన్నారో బహుశ వారికే తెలియదేమో ! ఒక అంచనా ప్రకారం 25 గ్రూపులు ఉంటే మరొక అంచనా ప్రకారం 61 వర్గాలు ఉన్నాయి. తాజా సమా చారం ప్రకారం ఇటీవలే ఢిల్లీలో సమావేశమైన అఖిల భారత కమ్యూ నిస్టు విప్లవకారుల సదస్సుకు 14 నక్సలైట్ గ్రూపులు తమ ప్రతినిధు లను పంపాయి.

జాతీయ స్థాయిలో ఎలా ఉన్న రాష్ట్రంలో మాత్రం ప్రస్తుతం 9 నక్సలైట్ గ్రూపులు వివిధ నామధేయాలతో నాయకత్వంలో పని చేస్తున్నాయి.

(వివరాలు ప్రక్క పేజీలో)

| వర్గము | ప్రధాన నాయకులు |
|---|---|
| 1 చంద్రపుల్లారెడ్డి గ్రూప్ | సత్యం, పెద్దన్న (కర్నూలు), పైలా వాసుదేవరావు, వి వి. నరసింహం చలపతిప్రసాద్ (శ్రీకాకుళం), మాదాల నారాయణ స్వామి పాతూరి ఆదినారాయణ స్వామి చంద్రన్న (గుంటూరు) రాయల సుభాష్ చంద్రబోస్, రవి(ఖమ్మం)యానాలమల్లారెడ్డి(నల్లగొండ) |
| 2 పీపుల్స్‌వార్ గ్రూప్ | కొండపల్లి సీతారామయ్య (కృష్ణ) కె ఎస్. రాఘవరావు (ఆదిలాబాద్) కె. జి. సత్యమూర్తి, ఎస్. వి. శివాజీ (వరంగల్)ముక్కు సుబ్బారెడ్డి, ఎం. ఎస్.రంగారావు(ప్రకాశం) ఐ. వి. సాంబశివరావు, చిన్న (విశాఖపట్నం) |
| 3 రీ-ఆర్గనైజేషన్ కమిటీ | ఎస్.ఏ. రవూఫ్ (అనంతపూర్) చార్ల యాదగిరిరాజు(వరంగల్) లింగా విజయకుమార్, డామా భూలక్ష్మయ్య కాతికర్ (ఖమ్మం) |
| 4 లిన్‌పియావో వ్యతిరేక చారుమజుందార్ అనుకూల గ్రూప్ | ఇంతారమణారెడ్డి, మోగంటి బాబూరావు (తూర్పుగోదావరి) పోరంకినర్సరాజుపశ్చిమ గోదావరి) |
| 5 లిపినియావో అనుకూల చారుమజుందార్ | మైలానరయ్య (ఖమ్మం) నర్ర లక్ష్మణరావు రహమాన్సఅత్తపుర్ రహమాన్ (కృష్ణా) |
| 6 యూనిటీ సెంటర్ ఆఫ్ కమ్యూనిస్టు రివల్యూషనరీస్ | దేవులపల్లి వెంకటేశ్వరరావు |
| 7 యూనిటీ సెంటర్ ప్రత్యర్థి వర్గము | చల్లపల్లి శ్రీనివాసరావు, మానంరామారావు |
| 8 సి. పి. ఎం. ఎల్. యూనిటీ కమిటీ | కొల్లా వెంకయ్య, నంకబు కోటయ్య (కృష్ణా) |
| 9 మామిడి అప్పలసూరి గ్రూప్ | జి. ప్రసాదరావు (విజయనగర- |

సఫలం అవుతాయి. ఇది రష్యాలో లెనిన్, చైనాలో మావో నిరూపించారు. దురదృష్టవశాత్తు భారత కమ్యూనిస్టు హ్రస్వదృష్టి ఈ యథార్థాన్ని చూడ లేకపోతున్నది.

5. భారతదేశంలో కమ్యూనిస్టు విప్లవకారులు మావో "లాంగ్ మార్చ్" నాటి పంథాను రూపొందించుకున్నా 1948-51 కాలంనాటి తెలంగాణా సాయుధపోరాటం ప్రభావంనుంచి ఇంకా బయటపడలేదు. ఈలోగా ఎన్నో మార్పులు వచ్చాయి. ప్రసార సాధనాలు రవాణా మార్గాలు అభివృద్ధి చెందాయి. రాజ్యశక్తి ఉద్యోగ బృందము పోలీసు రహస్య గూఢచారిశాఖ, సైన్యము మరింత శక్తివంతమయింది. ముప్పై సంవత్సరాల క్రితమే తెలంగాణా కమ్యూనిస్టు పోరాటాన్ని సునాయా సంగా అణిచి వేసిన ప్రభుత్వానికి ఈనాటి తీవ్రవాదుల ఉద్యమాలు అతి స్వల్పమైనవి. కానీ మన విప్లవకారులు "వీరతెలంగాణాను" అరిగిపోయిన రికార్డులా ఇంకా ఉపయోగిస్తున్నారు.

6. రైతాంగ, కార్మిక, అణిచివేయబడ్డ ప్రజల విప్లవం అని చెప్పబడే నక్సలైట్స్ కార్యకాలాపాలు, ఉద్యమాలు ఈనాటికీ అగ్రకులాల ఆధ్వర్యంలో కొనసాగుతున్నాయి. గిరిజన దళిత కార్మిక కర్షక వర్గాల నుంచి నాయకత్వం ఏర్పడలేదు. అగ్రకులాలవారిగా దేవులపల్లి వెంకటేశ్వరరావు, ఆదిభొట్ల కైలాసం, రామలింగాచారి, పంచాద్రికృష్ణ మూర్తి, సుబ్బారావు పాణిగ్రాహి, (బ్రాహ్మణ) తరిమెల నాగిరెడ్డి చంద్రపుల్లారెడ్డి, కొండపల్లి సీతారామయ్య, ఇంత రమణారెడ్డి, తరిమెల రాందాస్‌రెడ్డి (రెడ్డి), చాగంటి భాస్కరరావు, కొల్లావెంకయ్య, మాదాల నారాయణస్వామి, ఎం. ఎల్. నారాయణ (కమ్మ) వారే ఉద్యమాలను నిర్వహిస్తున్నారు. ఇంతేకాక వీరిలో చాలామంది భూసామ్య ధనిక వర్గాల నుంచి వచ్చిన వారేకాని సమాజంలో దళిత స్థాయి నుంచి ఉద్యమంలో

ఎదిగిన వారుకాదు. భూస్వామ్య పెట్టుబడిదారీ వ్యవస్థలను నేల రాచాలని ఎలుగెత్తి నినాదాలిస్తున్న విప్లవకారులు కులతత్వ బాలారిష్టం నుంచి ఇంకా బయటపడలేదు.

## చీలిపోయిన నక్సలైట్స్

ఆదిలోనే హంసపాదన్నట్లు చారూమజుందార్ నాయకత్వంలో ఏర్పడిన భారతకమ్యూనిస్ట్‌పార్టీ (మా.లె.) సంవత్సరంలో వలే చీలికలకు గురి అయింది. వీటిలో ప్రధానమైన 14 నక్సలైట్ వర్గాలు ఇటీవలే తమ పంథాను నిర్ణయించటానికి సమైక్యతను సాధించడానికి సంసిద్ధమవుతున్నాయి.

సి పి.ఐ ఎం.ఎల్ ఏర్పడే నాటికే ఆంధ్రప్రదేశ్ విప్లవకారుల సమన్వయ కమిటీ సంఘం తీవ్రచీలికలకు గురిఅయింది. శ్రీకాకుళం ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న ఆదిభొట్ల కైలాసం, వెంపటాపు సత్యనారాయణ, అప్పలసూరి చారూ మజుందార్ వర్గంలో ఉండిపోయారు. గుంటూరులో కొల్లావెంకయ్య నాగిరెడ్డిని ఖండిస్తూ బయటికి వచ్చారు. విశాఖ, కృష్ణా, వరంగల్, హైదరాబాద్ జిల్లాలలో కూడా గణనీయమైన సంఖ్యలో పార్టీ కార్యకర్తలు చారూవర్గంలో చేరటం జరిగింది.

1969 చివరి నుండి ప్రారంభమై 1972 నాటికి చంద్ర పుల్లారెడ్డి కొండపల్లి సీతారామయ్య, దేవులపల్లి, నాగిరెడ్డి, రవూఫ్ వర్గాలు ఏర్పడినాయి. నాగిరెడ్డి మరణానంతరం (1976) దేవులపల్లి ఆ గ్రూపుకు నాయకత్వం వహిస్తున్నారు. ఇలా అనేక రకాలుగా చీలిన మనరాష్ట్రంలోని నక్సలైట్ ఉద్యమం ప్రస్తుతం 9 వర్గాలుగా పని చేస్తున్నది. వీటిలో ప్రధానమైనవి ఐదు మాత్రమే అవి : 1. కొండపల్లి సీతారామయ్య పీపుల్స్‌వార్ గ్రూప్] 2. చంద్రపుల్లారెడ్డి గ్రూప్ 3. దేవులపల్లి వెంకటేశ్వరరావు గ్రూప్ 4. రవూఫ్ గ్రూప్ 5. ఇంత రమణారెడ్డి నాయకత్వంలో పనిచేస్తున్నలిన్ పియావో గ్రూప్.

భారత కమ్యూనిస్ట్‌పార్టీ (మా.లె) అనేక వర్గాలుగా చీలిపోయిన వారందరూ చైనాపంథానే విశ్వసిస్తున్నారు. మావో మరణానంతరం చైనాలో ఏర్పడిన నాయకత్వం ఇంకా స్థిరపడలేదు కాబట్టి మన నక్స లైట్ విప్లవజారులు భవిష్యత్‌లో ఎవరిని అనుసరిస్తారో ఇప్పుడే చెప్పలేము. అయితే ఒకటిమాత్రం ఖాయం. వారుఎవరినైనా అనుసరించాలేకానీ స్వత హాగా మాత్రం ఆలోచించి స్థానిక పరిస్థితులకు అనుగుణంగా వ్యవ హరించలేరు.

ఈ వర్గాల మధ్య ఎన్ని విభేదాలు ఉన్నప్పటికీ కొన్ని అంశాలపై మాత్రం ఏకాభిప్రాయం ఇవి కలిగి ఉన్నాయి:

1. సోవియట్ వ్యతిరేకత.
2. చైనాను అంతర్జాతీయంగా సమర్థించడం.
3. సైద్ధాంతికంగా మావో ఆలోచనా సరళిని అనుసరించడం.
4. సోదర సి.పి.ఐ., సి.పి.యం లను ద్వేషించడం.

## నక్సలైట్ ఉద్యమ పునరుద్ధరణ

ఇటీవలికాలంవరకూ స్తబ్ధతదశలో ఉన్న నక్సలైట్ కార్యక్రమాలు తిరిగి చెదురుమదురుగా తలెత్తుతున్నాయి. అత్యవసరపరిస్థితితొలగిపోయిన (1977) తరువాత జనతా ప్రభుత్వం హయాంలో పునరుద్ధరింపబడిన ప్రజాస్వామ్య హక్కులను ఆసరాగా చేసుకొని లీగల్(ఎన్నికలు) ఇల్లీగల్ కార్యకలాపాలలో తిరిగి చురుకుగా ఖమ్మం, వరంగల్,నల్లగొండ, ఆదిలా బాద్ కరీంనగర్ జిల్లాలలో వివిధ నక్సలైట్ గ్రూపులు తమ కార్యాకలా పాలను కొనసాగిస్తున్నాయి. అయితే వీరు స్థానిక ప్రజల మద్దతును పొందటంలోమాత్రం విఫలం అవుతున్నారు. గిరిజన ఉద్యమాలను నిర్వ హిస్తున్న వారిమద్దతును కావలసిన స్థాయిలో వీరు పొందలేక పోతున్నారు. దీనికి ప్రధాన కారణం ఉదమ్యాలను నిర్వహిస్తున్న వివిధ నక్సలైట్

వర్గాల నాయకులు ఆ ప్రాంతాలకు చెందిన వారు కాక పోవడమే పైగా గిరిజనులను ప్రోత్సహించి ఉద్యమం ఉధృత స్థాయికి చేరుకొన్న తరువాత వారిని వెన్నుపోటు పొడిచిన నక్సలైట్స్ నిజస్వరూపం ఇందర వెల్లిలో ఇటీవల జరిగిన సంఘటనలు స్పష్టం చేస్తున్నాయి. అక్కడి అమాయక ప్రజలైన గోండులను ప్రేరేపించి, ముందుకునెట్టి వారిని పోలీసు కాల్పులకు బలిచేయడం జరిగింది కానీ ఒక్క విప్లవ వీరుడు ప్రాణాలను అర్పించలేదు. ఒక్క కార్యకర్త కనీసం గాయపడలేదు. ఇది వారి త్యాగ నిరతికి, విప్లవ పంథాకు నిదర్శనాలు. పైగా కాంగ్రెస్ ప్రభుత్వం అటవీ ప్రజల ప్రయోజనాలకై బృహత్తర కార్యకలాపాలను అమలు పరచటానికి చేస్తున్న కృషి ద్వారా ఆ ప్రజల విశ్వాసాన్ని చూరగొనడంతో నక్సలైట్ల ప్రమేయం తగ్గిపోయింది. అంతేకాక గిరిజనులకు సంబంధించిన వారే వారూ ఈ ఉద్యమంలో ప్రధాన పాత్ర వహించక పోవటం మరొక విశేషము.

## దారి తప్పిన ఉద్యమం

పరిసర మైదాన ప్రాంతలలో ఉద్యమాన్ని వ్యాప్తి చేయటానికి కమ్యూనిస్ట్ విప్లవకారులు అనుసరిస్తున్న పద్ధతులు పరస్పర విరుద్ధమైనవిగానూ, గందరగోళాన్ని సృష్టించేవిగానూ కనిపిస్తున్నాయి. ఒకవైపు తుపాకి గొట్టం ద్వారానే విప్లవం ఫలించి అధికారంచేతికి వస్తుందంటూ (సాయుధ పోరాటాలు జరుపుతున్నామని చెప్పుకుంటూ) మరొక వైపు ప్రజాస్వామ్య పరిరక్షణలకు పౌరహక్కులకు ఉద్యమాలు నిర్వహిస్తున్నారు.

వర్గ శత్రువుల నిర్మూలన అంటూ స్థానికులైన కొద్దిమంది ధనవంతులను నిర్మూలిస్తూ, వారికంటె సంపన్నులతో లాలూచీ పడటం సాధారణమయింది, ఒక వైపు హింసావాదాన్ని చేపట్టి రాజకీయాలతో ప్రమేయం లేనివారిని హతమారుస్తూ మరొకవైపు పోలీసు "ఎదురు కాల్పులు" పేరుతో

హాతమైన తమ అనుచరుల ప్రస్తావన వచ్చినపుడు హింసావాదాన్ని విమ ర్శిస్తూ ప్రజాస్వామ్య గొడుగు క్రింద రక్షణ పొందటానికి ప్రయత్నించి బాధపడుతున్నారు.

పీడిత ప్రజల ప్రయోజనాలకై వారిని సంఘటితం చేసి ప్రజాపోరా టాలను జరపాలని చెబుతూ అర్ధాంతరంగా ఉద్యమాలను వదిలిపెట్టి తమ వ్యక్తిగత ప్రయోజనాలను, కక్షలను సాధించడంతో నిమగ్నులవు తున్నారు. సిరిసిల్ల, జగిత్యాల రైతాంగ పోరాటాలు రాష్ట్రంలోని చాలా మంది దృష్టిని ఆకర్షించాయి కాని వారి పరిణామాలను జాగ్రత్తగా పరిశీ లిస్తే ఆ ఉద్యమాలు పూర్తిగా విఫలం అవటానికి నక్సలైట్లే కారణం అని చెప్పవచ్చు. 1980 పార్లమెంటరీ ఎన్నికలలో మార్క్సిస్ట్ లెనినిస్ట్ పార్టీ అభ్యర్థి కరీంనగర్ లోక్‌సభ నియోజకవర్గంలో చిత్తుగా ఓడిపోవటమే కాక ధరావత్తును కూడా కోల్పోవటం, పీడితప్రజల మద్దతునే వారు పొందలేక పోయారన్నది స్పష్టంచేస్తున్నది.

స్థానిక మరియు పీడిత ప్రజల ప్రయోజనాలకై తీవ్రవాదులు చేపట్టిన పోరాటాలు ఆయా ప్రాంతాలలో అరాచకాన్ని మాత్రమే సృష్టిస్తు న్నాయి. కాని ఉద్యమాలు బలపడటంలేదు. గోదావరి ఖని, తదితర ప్రాంతాలలో ఈ మధ్యనే జరిగిన బొగ్గుగనుల కార్మికుల సమ్మె దీనిని స్పష్టం చేస్తున్నది. పైగా పోలీస్, ప్రభుత్వ యంత్రాంగ జోక్యానికి అవ కాశాన్నిచ్చి శైశవదశలో ఉన్న నక్సలైట్ ఉద్యమానికి, ఉద్యమకారుల ఉనికికి ప్రమాదాన్ని తెచ్చుకొన్నారు.

ఉద్యమ వ్యాప్తిని అనుసరిస్తున్న విరుద్ధమైన పద్ధతులేకాకుండా, చేపట్టిన సమస్యలు కూడా నక్సలైట్ ఉద్యమ అనాదరణకు దారితీసింది. నూటికి 70 మంది నిరక్షరాస్యులైన మనరాష్ట్ర ప్రజల ముందు వారు లేవ దీసిన నినాదాలు "సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదం నశించాలి."

కాంపూచియాపై వియత్నాం దురాక్రమణను త్రిప్పికొట్టాలి. "ఎల్ సాల్వ డార్ విప్లవం వర్థిల్లాలి" మూడు ప్రపంచాల సిద్ధాంతం వర్థిల్లాలి" అగ్ర రాజ్యాల ఆధిపత్యం నశించాలి." "ఈశాన్య రాష్ట్రాల ఉద్యమాలు వర్థి ల్లాలి" మనతీవ్రవాదుల పరిజ్ఞానాన్ని ఎలుగెత్తిచూపటమే కాక, సామాన్య ప్రజలను తికమక పెడుతున్నాయి.

ఇందిరాకాంగ్రెస్ వారు వాడుతున్న పరిభాషకు స్వస్తి చెప్పి, సామాన్య ప్రజలకు అర్థం కాని రాజకీయ పదజలాన్ని ఉగ్రవాదులు ఉప యోగించటంవల్ల వారి విప్లవపురోభివృద్ధికి విఘాతం ఏర్పడింది.

తీవ్రవాదులు చేసే ప్రకటనలు, అనుసరిస్తున్న విధానాలు వారు సామాజిక పరిస్థితులను, స్థానికవ్యవస్థలో కీలక పాత్రను వహి స్తున్న కులతత్వం ప్రభావాన్ని అర్థం చేసుకోలేదనిపిస్తుంది. ఇది వీరి పార్టీ నాయకత్వంలోని ప్రధానమైన లోపం. పీడిత ప్రజల ఉద్యమం ఈ నాటికే అగ్రకులాల నాయకులే నిర్వహిస్తున్నారు. కానీ ఆయా ప్రజల నుంచి ఏర్పడిన నాయకత్వం ఇంకా కనబడటంలేదు. దీనివల్ల వారి మద్ద తును ఈ ఉద్యమాలు పొందలేక పోతున్నాయి. ఈ సత్యాన్ని విస్మరించి కేవ లం పోలీస్ దమనకాండవల్లనే తమ ఉద్యమాలు దెబ్బతింటున్నాయని ప్రకటించడం వారి హ్రస్వ దృష్టిని తేటతెల్లం చేస్తుంది.

పట్టణ ప్రాంతాలలో పెరుగుతున్న పెట్టుబడి దారీ విధానాన్ని, కేంద్రీకృతం అవుతున్నా సంపదను వదిలి పెట్టి, అవశేషాలుగా మిగిలి పోయిన భూస్వామ్యవ్యవస్థకు వ్యతిరేకంగా నినాదాలిస్తూ హైదరాబాద్ నగ రంలో సంపన్న హోటళ్ళలో తలదాచుకొంటూ, సుఖమయ వాతావరణంలో సేద తీర్చుకొంటూ విప్లవ దశ పరిపక్వం అయింది. సాయుధ పోరాటం వర్థిల్లాలి అని గర్జిస్తే ఏం లాభం ?

భారత రాజకీయాలలో అత్యంత ప్రాముఖ్యమైనది నాయకుని సమ్మోహనశక్తి. గాంధీ, నెహ్రూలు దీనిని ఉపయోగించి ప్రజా మద్దతును సంపాదించగలిగారు. ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీని ఈ నాటికే పీడిత ప్రజల "దేవత"గా భావించి, ఆరాధిస్తున్నారు నక్సలైట్ ఉద్యమం అటువంటి నాయకులను తయారుచేయలేకపోయింది. కాగా తమకుఉన్న పరిమిత ప్రజా సంబంధంతో కూడా వారి నాయకులు తమ ఆకర్షణ శక్తినీ పెంచుకోలేకపోతున్నారు. కాగా తమ ప్రాబల్యం ఉన్నదని చెప్పుకొంటున్న ప్రదేశాలలో కూడా వారి ప్రభావం కన్పించటంలేదు.

## గమ్యానికి చేరలేని నక్సలైట్లు

తరచు కమ్యూనిస్టులు చేసే పొరపాటే మన రాష్ట్రంలోని నకలైట్లు కూడా చేస్తున్నారు. నక్సలైట్ ఉద్యమంలో ప్రధానమైన లోపాలు: 1. సమైక్యతలోపించటం, 2. వాస్తవిక, జాతీయదృక్పథం లేక పోవటం, 3. చారిత్రక కారణాలు.

మన రాజకీయాలలో కమ్యూనిజం ప్రవేశించిన నాటినుండి నేటి వరకూ వారిని వేధిస్తున్న సమస్య సమైక్యత. చైనా, భారత దేశాలలో కమ్యూనిస్టు పార్టీ ఇంచుమించుగా ఒకేకాలంలో ఏర్పడ్డాయి. ఆర్థిక, సామాజిక పరిస్థితులలో ఈ రెండు దేశాలు ఇంచుమించుగా ఒక స్థాయిలో ఉన్నాయి. అయినప్పటికీ చైనాలో కమ్యూనిస్టు వ్యవస్థ ఏర్పడడమే కాకుండా రెండవ శక్తివంతమైనకమ్యూనిస్టు రాజ్యాంగం ఆవిర్భవించింది. మన దేశ, రాష్ట్ర పరిస్థితి దీనికి భిన్నంగా ఉంది. ఆంధ్రప్రదేశ్‌లో ఒకప్పుడు కమ్యూనిజం రెండవ శక్తిగా, కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయంగా పరిగణింపబడింది. అటువంటిది ఈనాడు ముక్కలై, చీలిపోయి శిథిలావస్థలో ఉంది.

మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలను ఆధారం చేసుకొన్న మన నక్సలైట్లకు స్థానిక రాజకీయాలలో ఒక నిర్దిష్టమైన కార్యక్రమం లేదు. ప్రజాబలాన్ని సమీకరించుకోలేకపోతున్నారు. సిద్ధాంతాన్ని స్థానిక పరిస్థితులకు అనువర్తింపజేసి ఒక క్రమబద్ధమైన కార్యక్రమాన్ని అమలుజరపటంలో విఫలం అవుతున్నారు. కాగా సైద్ధాంతిక ఆచరణలలో విభేదాలతో మునిగి తేలుతున్నారు.

విప్లవ కమ్యూనిస్టు ఉద్యమాలు విజయవంతమయిన దేశాలలో అక్కడి జాతీయశక్తులతో కమ్యూనిస్టులు కలిసి పనిచేస్తారు. చైనాలో మావో చైనా జాతీయవాదాన్ని బలపరుస్తూ పనిచేయడమే అతని విజయానికి కారణం. ఇందుకు భిన్నంగా భారత కమ్యూనిస్టులు మొదటినుంచీ జాతీయ ఉద్యమానికి వెలుపలేవున్నారు. అదేవిధంగా నక్సలైట్స్‌కూడా ఈ "చైనాపార్టీ మాపార్టీ చైనాచైర్‌మాన్ మాచైర్‌మాన్" అనే విదేశ నినాదంతో తాము ఏజెంట్లు అనేభావాన్ని ప్రజలలో కల్పిస్తున్నారు. లక్ష్యాలు సాధనాలను సమర్థిస్తాయి అనే సూత్రంతో ఎటువంటి నీచమైన పనికి వెనకాడటంలేదు. దీనివల్ల సాధారణప్రజలలో వీరు విప్లవవాదులుకారని విదేశీయుల తొత్తులని, సాంఘిక వ్యతిరేక శక్తులన్న భావం ప్రజలలో బలపడటానికి కారణమయింది.

చారిత్రాత్మకంగా పరిశీలిస్తే భారతదేశంలో ముఖ్యంగా, మన రాష్ట్రంలో హింసాయుత పద్ధతులపై ఆధారపడ్డ సాయుధ పోరాటాలు ఉద్యమాలు ప్రజాదరణ పొందలేదు. స్వాతంత్ర్యంపూర్వం, బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా నిర్వహించిన సాయుధ పోరాటాలు విఫలమైనాయి. ఆనాటి బెంగాల్, మహారాష్ట్రలలో జరిపినసాయుధ ఉద్యమాలు, చంద్రశేఖర్ అజాద్, భగత్‌సింగ్‌లు జరిపిన పోరాటాలు, మనరాష్ట్రంలో మన్యప్రాంతాలల్లో అల్లూరి సీతారామరాజు నిర్వహించిన దీనికి ఉదాహరణలు.

1946-51 మధ్యకాలంలో కమ్యూనిస్టులు నిర్వహించిన తెలంగాణా సాయుధ పోరాటంకూడా విఫలం అయింది. ఈకాలంలో అధికార మార్పిడి దేశవిభజన జరిగి సంధికాలవ్యవస్థలో, శైశవదశలోఉన్న మనప్రభుత్వాన్ని ఎదుర్కొని, ప్రజాదరణఉంటే అనాడే విజయాన్ని సాధించిఉండేవారు.

స్వాతంత్ర్యం వచ్చినప్పటినుండీ నేటివరకూ అధికారంలోఉన్న కాంగ్రెస్‌పార్టీ బలపడటానికి ప్రధానకారణం వారనుసరిస్తున్న ప్రజాస్వామ్య, అహింసావాదాలే. సాంస్కృతికంగా కూడా భారత ప్రజల హింసావాదాన్ని గర్హిస్తారు. అందువల్లనే హింసావాదాన్ని బలపరచే ఏ అతివాద సంస్థకూడా ప్రజాదరణను పొందటంలేదు.

నక్సలైట్ల ఉద్యమాలు ప్రస్తుతం రాజకీయ ఉద్యమాలుగా భావించబడుతున్నాయి. వారు అనుసరిస్తున్న విధానాలలో మార్పులు రాకుంటే ఈఉద్యమాలు ప్రజాదరణ కోల్పోయి కేవలం ప్రభుత్వానికి, ప్రజలకి భద్రతల సమస్యగానే మిగిలిపోతాయి. ఇప్పటికీ అనేకసమస్యలతో విసుగు చెందిన ప్రజలు ప్రభుత్వంతోపాటు కలసి ఈ మిడతలదండు బెడదను తొలగించడానికి ప్రయత్నం చేస్తారు. తీవ్రవాదుల హింసాయుత చర్యలకు చికాకుచెందిన ప్రజలు ప్రభుత్వ, పోలీసు ప్రమేయంలేకుండా సాయుధముఠాలను ఏర్పరచే ప్రయత్నాలు ప్రారంభమైనాయి. ఒకవేళ ఇదే జరిగితే బీహారులో సాయుధముఠాలమధ్య జరుగుతున్న సంఘర్షణలు మనరాష్ట్రంలో కూడా మొదలౌతాయి. ఇటు పోలీసు "ఎదురుకాల్పులు" అటు ప్రజల సంఘటిత వ్యతిరేకతలమధ్య దారితప్పి నక్సలైట్స్ వారి ఉద్యమాలు హింసా ప్రతిహింసా చర్యలమధ్య నామరూపాలులేకుండా పోయారు.

# యువనక్సలైట్ల విప్లవం ఇదేనా?

ప్రతి రాజకీయ పార్టీ తనలక్ష్య సాధనకై సంస్థ నిర్మాణ పటిష్ఠతకై యువతులను ముఖ్యంగా విద్యార్థులను ఆకర్షించటానికి ప్రయత్నం చేస్తుంది. మార్క్సిస్ట్ లెనినిస్ట్ వాదులైన నక్సలైట్లుకూడా తమపార్టీ అభివృద్ధి, ఆశయాల సఫలతకు యువకులు విద్యార్థులపై ఆధార పడటం సహజమే.

ప్రజాస్వామ్య పరిధిలద్వారాకాక, ప్రజాస్వామ్యేతర పద్ధతులద్వారా విప్లవాన్ని సాధించాలన్న ఉద్దేశంతో నక్సలైట్ పార్టీలు విశ్వవిద్యాలయాలు, అనుబంధ కళాశాలలో విద్యార్థులను సంఘటితపరిచి వారిలో సహజంగాఉండే ఉద్రిక్తతను విప్లవభావాలకు అనుగుణంగా మార్చటానికి ప్రయత్నంచేస్తూ ఈ లక్ష్యసాధనకు విద్యార్థి సంఘాలను స్థాపించారు.

సాంప్రదాయక సమాజంనుండి కుటుంబ క్రమశిక్షణతో సతమతమయ్యే యువతకు ఒక్కసారి విశ్వవిద్యాలయ ప్రాంగణంలోకి ప్రవేశించగానే స్వేచ్ఛా వాయువులు పీల్చాలన్న భావం కలుగుతుంది. సాహసికార్యకలాపాలపట్ల ఆసక్తి చూపేటట్లు చేస్తుంది. ఎటువంటి ప్రోత్సాహం ప్రోద్బలం లభించని సాంఘిక వాతావరణంకూడా యువ విద్యార్థులలో కొంత నిరాశ నిస్పృహలు కలిగిస్తాయి. సమానత్వంకోసం, స్వేచ్ఛకోసం పోరాడాలనీ,కట్టుబాట్ల శృంఖలాలను తెంచుకోవాలన్న తపన వారిలో సహజంగా కలుగుతుంది. ఆదర్శాలు వారిని ఏదో చేయాలనీ ఏదో సాధించాలన్నా ఉరకలు పరుగులు చేయిస్తాయి. ఇటువంటి విద్యార్థులను ఆకర్షించడంలో మార్క్సిస్టు లెనినిస్ట్ వాదులు చాలావరకూ కృతకృత్యులైనారు. అందువల్లనే నక్సలైట్లువిద్యార్థి మరియు యువజన సంస్థలకు

అత్యంత ప్రాధాన్యమిస్తున్నారు. వారిలో విప్లవబీజాలు నాటటానికి కృషి చేస్తున్నారు. దానివల్ల యువకులైన విద్యార్థులు పార్టీకి పునాదులు కావటమే కాకుండా, ఆయువు అవుతారు.

విద్యార్థులు తాము ఆకర్షింపబడ్డ సిద్ధాంతాలలోటుపాట్లను తెలుసుకోకుండా, తర్కించ కుండా తమఊహాలోకంలో విహరిస్తూ ఒకకాల్పనిక వ్యవస్థను స్థాపిస్తున్నట్లు భావిస్తూ వాస్తవికతకు భిన్నంగా ఉంటున్నారు.

పైవాతావరణ ఫలితంగా ఏర్పడ్డ నక్సలైట్ల విద్యార్థి సంస్థలు మన కళాశాలలు, విశ్వవిద్యాలయాలలో విరివిగా కనిపిస్తాయి, వీటిలో ముఖ్యమైనవి.

1. ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘము (పి.డి.ఎస్ యు) 2. రాడికల్ స్టూడెంట్స్ యూనియన్ (ఆర్.ఎస్,ఓ.), 3. ప్రజాస్వామ్య విద్యార్థిసంఘము (డి.ఎస్.ఓ)

రాష్ట్రంలోని ప్రధాన నగరాలు, పట్టణాలలో, విద్యాసంస్థలున్న ప్రదేశాలలో ఈ పద్దుల ఉనికి వారు గోడలపై వ్రాసిన వ్రాతలద్వారా గమనించవచ్చు. తరచుగా వాళ్ళు విడుదలచేసే కరపత్రాలు, పోస్టర్లు మరొక నిదర్శనము. విద్యార్థిసంఘ ఎన్నికలు సమావేశాలు ఈసంస్థల స్వరూపాన్ని బయట పెడతాయి.

అన్నిటికంటే ముఖ్యమైనది. తరచుగా ఈ యువవిప్లవవాదులు లేవదీసే జాతీయ వ్యవహారాలకు సంబంధించిన నినాదాలు. (ప్రాంతీయ సమస్యలపై వారు జరిపే ఆందోళనలు. విద్యార్థులకు సంబంధించిన సమస్యలపై చేసే అలజడులు విద్యార్థి సంస్థల ఉనికిని., శక్తిని వెల్లడిస్తాయి)

మార్క్సిస్టు లెనినిస్టు సానుభూతిపరులు పార్టీకార్యకర్తలు సంఖ్యను పెంచటానికి, వారికి అనుకూలమైన అనుపంధ విద్యార్థి సంఘాలు సంస్థలు ఏర్పడి నిర్విరామంగా పని చేస్తున్నాయి. వీటి లక్ష్యం విద్యార్థులతో మార్క్సిజం లెనినిజంపట్ల అవగాహన ఆసక్తిని పెంచడం, క్రమశిక్షణ, వైజ్ఞానిక కుతూహలాన్ని అభివృద్ధి చేయడం. తద్వారా పార్టీనిర్మాణానికి మూలస్థంభమైన పట్టుదల కార్యదక్షత ఆత్మవిశ్వాసం, చిత్తశుద్ధి కలిగిన కార్యకర్తలను తయారుచేయడం. పైలక్ష్యాలను సాధించటానికి ఒక నిర్దిష్టమైన కార్యక్రమం అవసరం. యువవిద్యార్థులకు శిక్షణఇవ్వటానికివార మధ్య శక్తిని పదును పెట్టటానికికార్యక్రమాలు నిర్వహించాలి. ఇవేకాకుండా సిద్ధాంత ప్రచారానికి సాధారణ ప్రజలలో ఆదరణ సంపాదించటానికీ ప్రజాఉద్యమాలను విద్యార్థిఉద్యమాలను నిర్వహించడంకూడా చాలా ముఖ్యమే. వీటిని నిర్వహించటానికి ఆమోదయోగ్యమైన ప్రజాసమస్యలను మరియు సామాజిక సమస్యలను వెలుగులోకితెచ్చి వాటి పరిష్కారానికి ఆందోళన చేయడం, తద్వారా తమ సిద్ధాంత దృక్పథాన్ని వాస్తవమైనది గా నిరూపించటానికి ప్రయత్నించడం.

ప్రస్తుతం తీవ్రవాద విద్యార్థి సంస్థలు విప్లవాన్ని ఊపిరిగా, పోరాటాన్ని ఆహారంగా అహోరాత్రులు నిద్రాహారాలుమాని పోరాటాలకు నిర్వహించడంలో విద్యార్థులకు ప్రోత్సాహాన్ని శిక్షణను ఇవ్వటానికి చేపట్టిన కార్యక్రమాలు ఎటువంటివి? వాటి ప్రభావం ఎంతవరకూ ఉంది? ఈ సందర్భంలో వారు నిర్వహిస్తున్న కొన్ని కార్యక్రమాలను పరిశీలిద్దాం.

## అంతర్జాతీయ నినాదాలు విప్లవాన్ని తెస్తాయా

అత్యంత ముఖ్యమైన జాతీయ, ప్రాంతీయ స్థానిక సమస్యలను వదలిపెట్టి సాధారణప్రజలకు అర్థంకాని, అసక్తిలేని అంతర్జాతీయ సమస్యలపై నినాదాలతో, గోడమీద వ్రాతలతో, ప్రదర్శనలతో తృప్తిపడు

తున్నారు. "అమెరికా సామ్రాజ్యవాదం నశించాలి," అంటే బహుశ కొద్ది మందికి తెలుస్తుందేమోకానీ "రష్యన్ సోషల్ సామ్రాజ్యవాదం అంటే ఎంతమందికి అర్థంఅవుతుంది? అలాగే పోలండ్‌లో జరుగుతున్న రాజకీయ పరిణామాలు, వాటితో రష్యాకు ఉన్న సంబంధంగురించి వారు లేవదీసే నినాదాలు ఎంతమందిని ఆకర్షిస్తాయి? భారత రష్యాల మైత్రీ సంబంధాలపట్ల సరైన అవగాహన లేకుండా వాటిని ప్రజల తక్షణ జీవన్మరణ సమస్యగా చిత్రించటం ఎంతవరకూ అతివాద ఉద్యమవ్యాప్తికి సహకరిస్తుంది? ఆఫ్గనిస్థాన్‌లో రష్యా సైనిక జోక్యాన్ని గర్హిస్తూ ఇదొక ముఖ్యసమస్య అని గోడపైనినాదాలు వ్రాస్తే సరిపోతుందా? కాంపూచియా అంటే దేశమో మనిషో తెలియని మన పాటకజనం ఎంతవరకూ ఉత్తేజితులవుతారో వారికే తెలియదు. ఎల్ సాల్వడార్ పేరు ఇంతవరకూ వినని మన విద్యార్థిలోకానికి దానినొక విషమసమస్యగా చిత్రించిన నక్సలైట్ల ఉద్దేశం ఏమిటి?

ఈ శాన్యరాష్ట్రాల ఉద్యమాల స్వరూపంగురించి ఏమీ అవగాహన లేని మన ప్రజలముందు ఇవి వర్ధిల్లాలని నినాదాలివ్వటంవల్ల ఒరిగేదేమిటి? జాతీయతత్వాన్ని తృణీకరించి సంకుచిత ఏర్పాటు ఉద్యమాలకు అరాచక ఆందోళనలకు సానుభూతిని ప్రకటిస్తే పాతప్రయోజనాలు ఎంతవరకూ పరిరక్షింపబడతాయి. కేవలం స్థానికంగా పరిమితమైన సిరిసిల్ల, జగిత్యాల రైతాంగ ఉద్యమాలను మహావిప్లవాలుగా చిత్రించడం ఆత్మవంచన చేసుకోవడమే అవుతుంది.

సిసలైన మార్క్సిస్టు–లెనినిస్టుల ధ్యేయం విప్లవాభివృద్ధికై ప్రయత్నించటం, విప్లవ ధ్యేయం సమాజాన్ని మార్చటమే అయితే మనకున్ర నక్సలైట్లు కార్యకలాపాలు ఈలక్ష్య సాధనకు ఉపయోగపడుతున్నాయా? ఒకవైపు బూర్జువా విద్యావిధానాన్ని విమర్శిస్తూ మరొకవైపు మార్క్సుల

కోసం, పరీక్షల వాయిదా కోసం, ఫస్టుక్లాసులకోసం ప్రయత్నించి ప్రయోజనాలను పొందాలనుకోవటం బూర్జువా లక్షణాలను మరింత బలపడేటట్లు చేయడంకాదా?

# శాస్త్రీయవిద్యావిధానం అంటే విద్యా సంస్థలపై బురదనీళ్ళు జల్లడమా?

శాస్త్రీయ విద్యావిధానం కావాలంటూ విద్యార్జన తృణీకరించి, విద్యాసంస్థలపై బురద జల్లడం శాస్త్రీయ విద్యావిధానమా? ఒకవైపు కార్మిక, కర్షక మేధావి విద్యార్థి సమైక్యత వర్ధిల్లాలంటూ మరొకవైపు మేధావి ఉపాధ్యాయ వర్గాలను ప్రభుత్వ బానిసలుగా చిత్రీకరిస్తూ ప్రస్తుత బూర్జువా వ్యవస్థకు వాళ్ళు పునాదిరాళ్ళంటూ అడుగడుగునా వారిని న్యూనత పరచటం, డిగ్రీలకోసం, రాంకులకోసం అన్ని మార్గాలను అనుసరించడం శాస్త్రీయ విద్యావిధానంలో ఒకభాగం అనుకొందామా?

## హాస్టల్సులో కాలక్షేపంచేస్తే విప్లవాలు వస్తాయా?

బూర్జువా విలువలను పెంపొందించే ప్రభుత్వ విధానాలను, ప్రోత్సహించే విద్యార్థి ఉపకారవేతనాలు సరిపోవనీ వాటిని పెంచాలనీ ఆందోళ[illegible] జరపటం ప్రభుత్వాన్ని సమర్థించటమే అవుతుంది ఒ[illegible]వై[illegible] [illegible]శంలో అధికశాతం ప్రజలు బూర్జువా దళారి భూస్వామ్య[illegible] [illegible]ంచె[illegible] బడుతున్నారని నినాదాలిస్తూ [illegible]గాకవెహ మెస[illegible]లు తగ్గించా[illegible] ఫాను, టీవి. సౌకర్యాలు పెంచాల[illegible] జేబుఖ[illegible] [illegible]ఖ్యత[illegible] అధికం [illegible]

లనీ మన తీవ్రవాదులుచేసే ఆందోళనలు వారి చిత్తశుద్ధిని శంకించవలసిన పరిస్థితిని కల్పిస్తున్నవి. వీటివల్ల విప్లవధోరణి నశించడమేకాకుండా బూర్జువా, ఫ్యూడల్ సంస్కృతి విద్యార్థులలో మరింత బలపడుతున్నది.

గ్రామీణ ప్రాంత ప్రయోజనాలకు పనిచేయాలనీ శారీరక శ్రమ పట్ల గౌరవాన్ని పెంచుకోవాలనీ చెబుతూ "విద్యార్థులారా! గ్రామాలకు తరలండి! వాస్తవిక జీవితాన్ని అధ్యయనం చేయండి!" అని నినాదాలిస్తూ జన్మజన్మల అనుబంధంగా కాంపస్‌లను అంటిపెట్టుకొంటే విప్లవం వస్తుందా? దారీ తెన్నూ తెలియని నిరుద్యోగ భయంతో, నిరాశతో నీరసించిపోయిన విద్యార్థులకు ఈనాడు విశ్వవిద్యాలయాలు "గంజి కేంద్రాలుగా" తయారైనాయి.

వాస్తవానికి విద్యార్థులను అనేక స్వల్ప విషయాలపై మన యువ తీవ్రవాదులు లేవదీసిన ఆందోళనల ఫలితంగా సాధారణ విద్యాజీవనం ఒడుదుడుకులకు లోనైంది. విద్యార్థుల ప్రధాన సమస్యలైన కనీస సదుపాయాలు, వసతి, గ్రంథాలయ సౌకర్యాలు, కావలసిన అధ్యాపకుల సంఖ్య, శారీరక వ్యాయామశిక్షణ, ఆటలు మొదలైనవి వారిదృష్టిని ఆకట్టుకోవడంలేదు. ప్రైవేటు సంస్థల యాజమాన్యం, వారి వైఖరి, అధ్యాపక, అధ్యాపకేతర సిబ్బంది సమస్యలు అధ్యాపక-విద్యార్థి సంబంధాలు వాటిపై ఆందోళన జరిపిన కొంతసానుభూతిని, మద్దతును సంపాదించే అవకాశం ఉంది.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం బూటకమనీ ఎన్నికలను బహిష్కరించాలనీ నినాదాలిస్తూ విద్యార్థిసంఘాలు ఎన్నికలలో పెద్దఎత్తున తీవ్ర

వాదులు పాల్గొంటున్నారు. విప్లవాన్ని బలపరచి పనిచేయటానికి బదులు, ఎన్నికల రాజకీయాలలో తలదూర్చి తమశక్తి సామర్థ్యాలను విలువయిన కాలాన్ని విద్యార్థి రాజకీయాలకు వెచ్చించి విద్యాసంస్థల ప్రాంగణాలను ముఠా కొట్లాటలకు తీవ్రఘర్షణలకు నిలయంచేస్తున్నారు. దీనివల్ల విద్యాసంస్థలు, శ్వవిద్యాలయాలు మూతపడే పరిస్థితి ఏర్పడుతున్నది.

## కుహనా మార్క్సిస్టు మేధావులు

విద్యాసంస్థలలో పనిచేస్తూ నక్సలైట్ల ఉద్యమంలో భాగస్వామ్యం ఉందని చెప్పుకుంటూ కాలంగడిపే అధ్యాపక మార్క్సిస్టు మేధావులు కొంతవరకూ పైపరిస్థితి ఏర్పడటానికి కారణమని చెప్పవచ్చు.

సూర్యునికిరణాలు తగిలితేనే కందిపోతామన్న సుకుమారమైన జీవన సరళిని అనుసరిస్తూ బూర్జువా వ్యవస్థలోని సామాజిక ఆర్థిక సౌకర్యాలను వదులుకోటానికి ఇష్టపడక ప్రజల దయనీయ స్థితిపట్ల పెదవి సానుభూతి చూపుతూ, ఊకదంపుడు ఉపన్యాసాలనిస్తూ సెమినార్లతో కాన్ఫరెన్సులతో కాలక్షేపం చేసే మన మార్క్సిస్టు మేధావివర్గం విప్లవ ప్రగతికి పెద్దఅవరోధంగా తయారయింది. వారి వ్యక్తిగత జీవనానికి చెప్పేమాటలకు ఎక్కడా పొంతన కనపడటంలేదు.

వ్యక్తిగతంగా విప్లవ పంథాను అనుసరించకుండా సాహసికత, చిత్తశుద్ధిలేకుండా అమాయిక విద్యార్థులను ముందుకునెట్టి సమాజంలో పరాన్నజీవులుగా చల్లని బీరుతో సేదతీర్చుకొనే మన మార్క్సిస్టు మేధావులు విప్లవానికేకాకుండా సాధారణ సమాజప్రగతికి నిరోధకులు.

"నొప్పులు లేనిదే తల్లి ప్రసవించదు. విప్లవంరానిదే సమాజం మారదు" అని నినాదాలిచ్చేవారు "చిత్తశుద్ధిలేనిదే ఉద్యమం రాదు. త్యాగంలేనిదే విప్లవం ఫలించదు" అన్న విషయాన్ని గుర్తుంచుకోవటం మంచిది.

